శ్రీ

శ్రీ సద్గురు మహరాజ్ [illegible] నమః



# జ్ఞానకథలు

ఇందులోని కథలను మననము చేసినవారికి
తప్పక భక్తి జ్ఞాన వైరాగ్య సంపదలు కలుగును.





గ్రంథకర్త
శ్రీ చిన్మయ రామదాసు

ఓమ్



శ్రీ మహర్షి మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

# జ్ఞానకథలు



ఇందులోని కథలను మననము చేసినవారికి

తప్పక భక్తి జ్ఞాన వైరాగ్య సుఖములు కలుగును.





గ్రంథకర్త

శ్రీ చిన్మయ రామదాసు

# విషయసూచిక

పుటలు

# మున్నుడి

మోక్షప్రియులారా! పరమశాంతిని కోరు భక్తజనులారా! వేదశాస్త్రములు సత్యాసత్య, ధర్మాధర్మములను సిద్ధాంతము చేయును. కథలన్ననో సత్యాసత్య, ధర్మాధర్మ వర్తనల వలన కలిగిన సుఖదుఃఖ, స్వర్గనరకాద్యనుభవములను బైటపెట్టును. కనుక అనేక గ్రంథములలోని కథలను భక్త జనుల ఉపయోగార్థము చేర్చి ఈ గ్రంథరూపముగా అచ్చు వేయించడమైనది.

ఈ గ్రంథములోని కథలను చదివి మననముచేయుచున్నవారికి తప్పక భక్తి జ్ఞాన వైరాగ్యములు గలుగు ననువిశ్వాసము గలదు.

ఓమ్

శ్రీ మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

# దైవప్రార్థన

శ్లో. మల్యాళస్వామి దేవాయ, మహనీయ గుణాత్మనే
నిత్యానంద స్వరూపాయ, నిర్మలాయ నమో నమః.

శ్లో. వినాయకం గురుం భానుం బ్రహ్మ విష్ణు మహేశ్వరాన్
సరస్వతీం ప్రణమ్యాదౌ సర్వకార్యార్థ సిద్ధయే.

శ్లో. విష్ణుం నారాయణం కృష్ణం మాధవం మధుసూదనమ్
హరిం నరహరిం రామం గోవిందం దధి వామనమ్.

## నిజమెరిగినవారికి కోరిక, క్రోధము, దుఃఖము లుండవు

నిత్యమైనదానిని ( పరమాత్మను ) నిత్యమైనదిగాను, అనిత్యమైన జగమును ( దేహమును ) అనిత్యమైనదిగాను తెలిసికొని స్థిరనిశ్చయముతో సదా యుండుట సామాన్య జ్ఞానమగును. 'సర్వము పరబ్రహ్మమే' యను అద్వైతానుభవము విశేషజ్ఞాన మగును. జ్ఞానముగలవారే లోకములో సుఖముగా నుండగలుగుదురు. జ్ఞానమే ఆనందమయము. అజ్ఞానము దుఃఖమయ మగును.

## మమకారతత్త్వ మెరిగిన జనకమహారాజు

కథ : ఒకప్పుడు వసిష్ఠ భగవానుడు ఒక యజ్ఞమును చేయుటకు నిశ్చయించుకొనెను. అపుడు ఆ యజ్ఞమునకు అనేకమంది ఋషులను, జనకమహారాజును ఆహ్వానించిరి. ముందుగా ఋషులు వచ్చియుండిరి. జనకమహారాజు రాలేదే యనుకొనుచు వసిష్ఠుడు యజ్ఞమును ప్రారంభించుటలేదు. అందువలన ఋషులు కోపముగలవారై "గొప్ప గొప్ప ఋషులము మనము వచ్చియున్నప్పటికిని ఈ వసిష్ఠుడు యజ్ఞమును ప్రారంభించడేమి? మనకంటే గృహస్థుడైన జనకుడు గొప్పవాడా యేమి!" అని గుసగుసలాడుచుండిరి. దీనిని వసిష్ఠుడు గుర్తించియుండి జనకుడు వచ్చిన తరువాత యజ్ఞమును ప్రారంభించి చేయుచు, తన యోగశక్తిచే మిథిలానగరము దహనమగునట్లు గొప్ప అగ్నిని సృష్టించెను. ఆ యగ్ని ఋషుల కుటీరములవరకు వ్యాపించెను. అపుడు ఋషు

లందరున్ను కుటీరాదులపైగల మమకారముచేత వానిని కాపాడుకొనుటకై పరుగులెత్తి వెళ్ళిపోయిరి. జనకమహారాజు మాత్రమే మిథిలానగరవాసులు పెద్దగోలగా ఏడ్చు చున్నప్పటికి కొంచెముకూడ మమకారములేనివాడై యజ్ఞ మును చూచుచు వసిష్ఠుని దగ్గరనే కూర్చొని కదలక యుండెను. దీనిని ఋషులు చూచి తమకంటే జనకమహారాజే గొప్పవాడు అని నిశ్చయించుకొనిరి.

దృక్కుపై (పరమాత్మపై) మమకారము గలవారు వివేకులు. దృశ్యముపై మమకారము గలవారు అవివేకులు. మమకారముచేత ఋషులు బాధపడిరి. త్యాగగుణము చేత (నిర్మమత్వముచేత) జనకమహారాజు ఆనందముగా నుండెను. దీనివలన సన్న్యాసులలో సంసారు లుందురనియు, సంసారులలో సన్న్యాసు లుందురనియును గ్రహించవలెను.

తే. ప్రియమె దుఃఖంబు గల్గించు ప్రియమె వివిధ
శోకపరిదేవనంబుల కాకరంబు
అవని యెవనికి ప్రియవస్తు వను న దొకటి
లేదొ వానికి దుఃఖాలు లేనెలేవు. (బుద్ధచర్య)

## కర్మ (మరణ) తత్త్వమెరిగిన వారికి దుఃఖము రాదు

కథ : గౌతమి యను ఒక భర్తరాలు కలదు. ఈమెకు ఏకైకకుమారుడు కలడు. అత డొకనాడు పాము కరచుటవలన చనిపోయెను. అపు డొక ఎరుకలవాడు పామును

చంపబోవగా ఆ తల్లి చంపవలదనియు, వాడు చేసికొనిన కర్మదోషమువలన ఆపాము కరచినదనియు చెప్పి నివారించెను. కర్మరహస్య మెరిగిన తల్లియగుటవలన దుఃఖపడక పామును చంపనీయలేదు. పాము కూడ ఎరుకలవానితో "ఓ కిరాతుడా, ఆ పిల్లవాడు చచ్చుటకు ముఖ్యకారణ కర్తను నేను గాను, యముడు" అని చెప్పెను. అప్పుడే యమధర్మరాజు వచ్చి "ఓ సర్పమా, ఆ పిల్లవాడు మరణించునట్లు చేసినది నీవూ కాదు, నేనూ గాను. లయకర్తయగు ఈశ్వరుడేయగు" నని చెప్పగా వెంటనే శివుడు వచ్చి "ఓ యమధర్మరాజా, ఆ గౌతమి కొడుకు చనిపోవుటకు కారణము సర్పమూ కాదు, నీవూ కావు, నేనూ కాను. వాడు చేసికొనిన పాపకర్మ దోషమే కారణ మగును" అని చెప్పి వెళ్ళిపోయెను.

శ్లో. జల మగ్నిర్విషం శస్త్రం క్షుద్వ్యాధిః పతనం గిరేః ।
నిమిత్తం కించిదాసాద్య దేహీప్రాణై ర్విముచ్యతే॥

తా. ఆయు వున్నంతవరకు (కర్మ వున్నంతవరకు) జీవుడు దేహమునం దుండును. లోకములో కొందరు జలములో పడుటయను నిమిత్త కారణముచేత, కొందరు అగ్నిలోపడి, కొందరు పాము, తేలు, మండ్రగబ్బ, కుక్కకాటులచే, (ఎండ్రిన్ త్రాగి) కొందరు కత్తిచే, తుపాకిచే కొట్టబడి, కొందరు తినుటకు తిండి, ఔషధము లేకపోవుటచేత, కొందరు కొండపైనుండి, చెట్టుపైనుండి పడుటచేతను ప్రాణమును గోల్పోవుచున్నారు.

## రాజు, బ్రాహ్మణుడు మరణతత్త్వ మెరుగుట

కథ: ఒకనాడు బ్రాహ్మణదంపతులు గ్రామాంతరమునకు అరణ్యమార్గముగుండా పోవుచు ఒకచెట్టు క్రింద విశ్రమించిరి. కొంతసేపైన తరువాత బ్రాహ్మణుడు లేచి, మంచినీటికి వెళ్ళెను. ఇంతలో గాలికి చెట్టుపై ఎంతకాలము నుండియో యున్న బాణము భార్యపై పడి గుచ్చుకొనెను. దానితో ఆమె ప్రాణము వదలెను.

ఇంతలో భర్త వచ్చుచుండగా ఒక కిరాతకుడు కనబడెను. భార్యదగ్గరకు వెళ్ళి చూడగా బాణము గుచ్చబడి చనిపోయియుండుటగాంచి ఆ కిరాతకుడే తనభార్యను చంపెనని నిశ్చయించుకొని అతనిని రాజుదగ్గరకు తీసుకొని వెళ్ళి "ఇతడు నాభార్యను బాణమువేసి చంపె"నని చెప్పగా "నేను చంపలే"దని ఏడ్చుచు కిరాతకుడు మరల మరల చెప్పెను. అపుడు రాజునకు ఏమియు తోచక శివాలయమునకు పోయి శివుని ప్రార్థించి చెప్పుకొనగా, శివుడు చెప్పినదేమనగా, "నీవును, బ్రాహ్మణుడును మారువేషముల వేసికొని ఈ నగరములో వైశ్యుని కుమార్తె పెండ్లికి వెళ్ళి చూచుచు కూర్చొనినచో నిజము మీకు తెలియు"నని.

అపుడా యిరువురున్ను వెళ్ళి కూర్చొనగా ఆకాశమున యమదూతల సంభాషణలు వినబడినవి. ఎట్లన: ఒకడు "ఈ వైశ్యుని కుమార్తె ప్రాణము నెట్లు తీసికొనిపోవలెను" అని అడిగెను. రెండవవాడు "బ్రాహ్మణుని భార్యపై చెట్టుననున్న బాణమును పడునట్లు చేసి ప్రాణమును తీసికొని పోయినట్లు

ఏదైన ఉపాయమును పన్ని తీసికొని వెళ్లవచ్చులే" యనెను. ఈమాటను విన్నతోడనే కిరాతకుడు నిర్దోషియని రాజు, బ్రాహ్మణుడున్ను నిశ్చయించుకొని కూర్చొని యుండగా, పెండ్లి జరుగుచున్న సమయములో మేళపు ధ్వనులకు దొడ్డిలో గల కోడెదూడ బెదరివచ్చి పెండ్లికూతురుపై బడి చంపెను. అపుడు అనేకులు ఏడ్చుచు గోలచేసిరి. రాజు, బ్రాహ్మణుడును కర్మరహస్యము దేవునికే తెలియునని దృఢపరచుకొని స్వగృహములకు వెళ్లిరి.

కథ : గాంధీమహాత్ముని యొక్క స్నేహితుని ఉత్తమ కుమారుడు చనిపోయినప్పటికిన్ని స్నేహితుడు దుఃఖపడకుండుట గాంధీ చూచి "ఏమయ్యా నీ కఠిన హృదయము! ఉత్తమ స్వభావముగల నీ కుమారుడు చనిపోయినప్పటికిని దుఃఖము రాలేదుగదా!" యనెను. అపుడు స్నేహితుడు "ఏ దేవుడు నాకీ కుమారుని యిచ్చినాడో, ఆ దేవుడే తీసికొని పోయినాడు. నాకేల మమకారము, యిక నాకేల దుఃఖము?" అని చెప్పెను. అపుడు గాంధీ ఆయనయొక్క నిర్మోహత్వమునకు ఆశ్చర్యపడెను.

కథ : మెహెర్ బాబావారి అన్నగారు చనిపోయినపుడు ఒకరిట్లు పశ్నించిరి: "స్వామీ, మీరు మీ అన్నగారు చనిపోయినను చింతగాని, దుఃఖముగాని పొందరేమి?" అపుడు బాబాగారు "నిద్రించియున్న మనిషినిచూచి మనము దుఃఖపడము. ఎందువలన అనగా అతడు మేల్కొనునని మనకు తెలియునుగదా! ఇట్లే నిద్రించిన మనిషి పాతశరీరమున మేల్కొనునట్లు, శరీరమును వదలిన మనిషి కూడా కొత్త

శరీరమునందు మేల్కొనును గాన దుఃఖపడు టెందుకు?'' అని సమాధానము జెప్పెను, ఆత్మకు చావు పుట్టుకలు లేవనియు, కర్మతో గూడిన జీవులకు కర్మ నశించువరకును (బ్రహ్మజ్ఞానము నొందువరకును) చావు పుట్టుక లుండుననియును, నిజ మెరింగిన వారికి చావు పుట్టుకలు వింతగా తోచవు.

## దేవుని వాక్యముపై విశ్వాసంగల దంపతులు

కథ: మళయాళ దేశములో భక్తదంపతులు గలరు. వీరి కెప్పుడే యే సంశయ మేర్పడినప్పటికిన్ని ఉపవాసముండి దేవుని అడిగి సంశయములను తీర్చుకొనుచుందురు. ఒకప్పుడు కుమారునకు జబ్బుచేసినది. ఎంతమంది వైద్యులు ఔషధములు నిచ్చినను వ్యాధి కుదరలేదు. వీ రొకనాడు ఉపవాసముచేసి పిల్లవాని వ్యాధిని గురించి దేవుని ప్రశ్నించగా "నత్వంశోచితు మర్హసి'' అని దేవుడు చెప్పెను. దీనిని గీతలో రెండవ అధ్యాయములో నున్నదని గుర్తునకు తెచ్చుకొని పూర్తి శ్లోకము చదివి పుట్టినది చచ్చుననియు, చచ్చునది మరల పుట్టుననియు ఈ నియమమునకు పరిహారము లేదనియు నీవు దుఃఖించుట తగదనియును చెప్పబడిన వాక్యములపై పూర్ణవిశ్వాసము గలవారై చివరకు పిల్లవాడు చనిపోయినప్పటికిని దుఃఖము లేనివారై జ్ఞాన వైరాగ్యములతో జీవితములను గడిపిరి.

## బాధల నిమ్మని దేవుని కోరిన కుంతీదేవి కథ

శ్రీకృష్ణభగవానుడు కుంతీదేవిని నీ కే యే ఐశ్వర్యములు కావలెనో యిచ్చెదను కోరుకొను మనగా,

శ్లో. విపదః సంతునః శశ్వత్। తత్ర తత్ర జగద్గురో
భవతో దర్శనం యత్ స్యాత్। అపునర్భవ దర్శనమ్.

తా. కృష్ణా, జగద్గురో! పునర్జన్మమును పోగొట్టునట్టి నీ దర్శనము (నీ స్మరణ) మాకు కలుగుటకుగాను, మా కెల్లప్పుడును కష్టములనే కలుగనిమ్ము అని కుంతీదేవి కోరెను.

ఐశ్వర్యము కండ్లను మూయించును. దారిద్ర్యాది కష్టములే మానవుల కండ్లను తెరచునట్లు చేయును. కష్టముల వలన అనేక నీతిధర్మములు తెలియబడును. శ్రీ సద్గురువులగు మహాత్ముల బోధలకంటే అన్యాయముగా మనలను బాధలు పెట్టువారి వలననే మనము తొందరగా పవిత్రుల మగుదుము. కనుక ప్రహ్లాదునివలె దైవస్మరణతో ఓర్చుకొనుట మన విధియై యున్నదని గ్రహించవలెను.

## కష్టములలో ఆనందముతోనున్న ధర్మరాజు

ద్రౌపది ధర్మరాజుతో, "నాథా, మనము ధర్మము తప్పక నడచుచున్నప్పటికిన్ని కష్టములు వచ్చుచునేయున్నవి గదా యను చింతలతో నాకు దుఃఖముగా నుంటున్నది" అనెను.

అపుడు ధర్మరాజు ద్రౌపదితో, "సతీ, ఎన్నెన్ని కష్టములు వచ్చి మీదపడుచున్నను, భగవానుని కృపవలన మనము నీతిధర్మములను తప్పక నడచుచున్నాముగదా యను నిశ్చయముతో నా కెప్పుడును సంతోషముగానే యున్న"

దనెను. దేహ మున్నచోట, ఆసక్తి (మోహము) వున్న చోటను దుఃఖ ముండును. ఎంత ఆసక్తి వుండునో అంత బంధము, దుఃఖము నుండును. సుషుప్తిలో దేహము, ఆసక్తియు లేనందున దుఃఖము లేదుగదా! ఇట్లే జాగ్రదవస్థ యందును వివేక జ్ఞానముతో గూడిన ఆత్మచింతనతో సదా యున్న వారికి దుఃఖము లేదు. ఆసక్తియొక్క ఫలితమే దుఃఖము. ఆశ (ఆసక్తి) లేనివారికి బాధ లుండవు.

## ధనాశలేని మైత్రేయి

కథ : యాజ్ఞవల్క్య మహర్షికి మైత్రేయి, కాత్యాయిని యను ఇరువురు భార్యలు గలరు. యాజ్ఞవల్క్యుడు సన్న్యాసాశ్రమమును స్వీకరించ దలచినవాడై ఇరువురి భార్యలకును ధనమును సమముగా పంచుటకు ప్రయత్నించుచుండగా, మైత్రేయి భర్తతో, "నాథా, మీరు ఏ మోక్షసుఖము నొందుటకు, ఏ పరబ్రహ్మము నొందుటకుగాను సర్వసంగ పరిత్యాగము జేయుచున్నారో, అదే నాకును కావలెనేగాని ఈ క్షణికమైన, అనిత్యములైన, దుఃఖహేతువులైన ధనాది భోగ్య పదార్థములు నాకు అవసరములే"దని చెప్పి గృహమును త్యజించి వెళ్లిపోయెను. అపుడు రెండవ భార్యకే అతడు ఆస్తినంత నిచ్చి సన్న్యసించెను.

## ధనాశకు లోబడి మోక్షమును త్యజించిన అభిరామయ్య కథ

వేమనయోగి యొక్క అన్నగారు రెడ్డిరాజు. ఆయన ఆస్థానములో అభిరామయ్య అను విశ్వబ్రాహ్మణుడు

బంగారపు నగలు చేయుచుండును. అభిరామయ్య శివభక్తుడగుటచేత ప్రతిదినము ఉదయమున కొండదగ్గరనున్న ఒక యోగిదగ్గరకు వెళ్లి ఉపదేశ మివ్వవలసినదని కోరుచుండును. ఆ యోగి ఇప్పుడుగాదు, యిప్పుడుగాదు అనుచు కాలము గడుపుచుండెను. అభిరామయ్య యోగివద్గరకు వెళ్లి ప్రొద్దెక్కి కోటలోనికి వచ్చుటచేత వేమన్నకు కష్టముగా తోచి ఈయన ఆలస్యముగా వచ్చుటకు కారణమేమో తెలిసికొనగోరి ఒకనాడు ఉదయమే చాటుగా అభిరామయ్య గృహము నుండి బైటకు పోవు మార్గమున పోయి యోగి దగ్గరకు అభిరామయ్య వెనుకనే పోయి నక్కియుండి అభిరామయ్యకు యోగి "రేపు ప్రొద్దున రమ్ము. నేను దేహమును చాలించు లోపల నీకు మంత్రోపదేశము చేసెదను" అని చెప్పిన మాటను వేమన్న విని, ఆ ఉపదేశమును తానే పొందవలెనని నిశ్చయముగలవాడై వదినెగారితో "అభిరామయ్యను రేపు ఏదైన నగచేసే పని చెప్పి బైటకు పోనీయకు"మని చెప్పెను. "అట్లే చేసెద" నని వదినె చెప్పెను. మరునాడు అభిరామయ్య గాఢచింతలో పడి "రేపు యోగిదగ్గరకు వెళ్లనియెడల చాలాకాలమునుండి తిరిగిన దంతయు వ్యర్థమగునుగదా! రాజుగారి ఆజ్ఞ తప్పి నడచినయెడల కుటుంబపోషణ జరుగదుగదా" యని తలంచి ప్రత్యక్ష సౌఖ్య లాభములగు ఐహిక సుఖమునకు లోబడెను. అక్కడ వేమన యోగితో బూటకములు చెప్పి తానే మంత్రోపదేశమును గ్రహించి మహాయోగి అయ్యెను.

పై జెప్పబడిన కాత్యాయిని, అభిరామయ్యల వలె ధనకాంక్షతో నుండి అనేకులు దేవుని, మోక్షమార్గమును

మరచిపోయి చెడిపోవుచున్నారు. ధనకాంక్ష, కామభోగ కాంక్ష, కీర్తికాంక్ష, అధికభోజనకాంక్షయును దైవమార్గములో నిలువనీయక భ్రష్టుని జేయును.

శ్లో. అర్థానా మార్జనే దుఃఖం, ఆర్జితానాంచ రక్షణే
నాశే దుఃఖం వ్యయే దుఃఖం, ధిగర్థం దుఃఖ భాజనమ్.

తా. ధనమును సంపాదించుట దుఃఖము. కూడబెట్టబడిన వాటిని కాపాడుట దుఃఖము. ధనము దొంగలవలనగాని, అగ్నివలనగాని, నీటివలనగాని నశించుట దుఃఖము. రోగాదులు వచ్చునపుడు ఖర్చుఅగుచున్నచో దుఃఖము. ఈవిధముగా దుఃఖము గలిగించే ధన మెందుకు?

ఆ. ధన మెచ్చిన మద మెచ్చును
మద మెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధన ముడిగిన మద ముడుగును
మద ముడిగిన దుర్గుణంబు మానును వేమా॥

ధనము వలన మరణ భయము, క్రోధమును గలుగును.

## శాంతము యొక్క, ధర్మము యొక్కయు నిజమెరిగిన రాజుకథ

ఒక బీదవాడు ఒకరోజున ఒక మామిడితోటగుండా పోవుచుండెను. అతడు మూడురోజులనుండి ఆహారము లేకపోవుటచేత ఆకలితో బాధపడుచుండెను. ఆ తోటలో చెట్లకు చాల మామిడిపండ్లున్నవి. ఆ పండ్లు తిని ఆకలి తీర్చు

కొనవలెననే యుద్దేశ్యముతో ఒకరాయి తీసికొని చెట్టుపైకి కొట్టెను. ఆదెబ్బకు రెండు రసముగలపండ్లు క్రిందపడెను. అతడు వాటిని తిని తృప్తిపడెను. ఆ రాయి విసరున పండ్లకు తగిలి పైకి పోయి తిరిగి, ఎక్కువ వేగముతో క్రిందపడెను. ఆ పడుటలో ఆ చెట్టుక్రిందనే యింకొకచోట కూర్చున్న రాజుగారి నెత్తిపై బడెను. రాజుగారు భోజనముచేసి భార్యలు, మంత్రులు, నౌకర్లతోపాటు తోటలోనికి వచ్చి ఆచెట్టునీడను ఇంకొక స్థలమందు ఆటలతో ప్రొద్దుపుచ్చుచుండెను. కాని రాజుగారున్న విషయము బీదవానికి తెలియదు. బీదవాడున్న విషయము రాజుగారికి తెలియదు.

రాయి రాజు తలమీద పడి వాని తల పాడయ్యెను. అతడా విషయమును గమనించలేదు. చుట్టునున్న మంత్రులు కనిపెట్టి గడ్డవేసినవానిని వెదకి చెట్టుక్రింద మామిడి పండ్లను తినుచున్న బీదవానిని పట్టుకొనిరి. వారిలో న్యాయాధిపతి విచారించి వానికి చావు శిక్ష విధించెను. అటు పిమ్మట రాజు తన ఆటలు ముగించుకొని లేవబోవగా న్యాయ శాఖామంత్రి బీదవాడు చేసినపనికి వానికి చావు శిక్ష విధించినట్లు తెలియపరచెను. అప్పుడు రాజు ఆ నేరస్తుని పిలిచి 'ఎందుకు రాయి విసరితి' వని అడిగెను. 'మామిడిపండు కొరకు విసరితి' నని అతడు జవాబు చెప్పెను.

'నీకు మామిడిపండ్లు దొరికినవా? వాటిని తింటివా?' అని రాజుగారు అడుగగా, 'దొరికినవి, తింటిని' యని బీదవాడు జవాబు చెప్పెను. అపుడు రాజుగారు న్యాయశాఖా మంత్రితో "ఈ బీదవాడు చెట్టుమీద రాయి రువ్వి రెండు

మామిడిపండ్లు క్రిందపడగా వాటిని తినెను. అవి తినుటవలన వాని ఆకలి ఎన్నిగంటలు లేకుండును'' అని అడిగెను. ''ఇరువది నాలుగుగంటలు ఆకలిబాధ లేకుండును'' అని మంత్రి జవాబు చెప్పెను. అపుడు రాజుగారు ''రేపు నేను ఈ కేసులో తీర్పు చెప్పెద''నని సెలవిచ్చిరి.

నిశ్శబ్దముగా వారి తీర్పుకు ఎదురు చూచుచుండిరి. ఆ తీర్పు జడ్జియొక్క తీర్పుకంటె కఠినముగా నుండునేమో యని ఊహించుచుండరి. కాని రాజుగారు ఈప్రకారము తీర్పు యిచ్చిరి.

'' ఈరోజు లగాయతు ప్రతిదినమును ఈ బీదవానికి యావజ్జీవము వాని భుక్తికి కావలసినంత డబ్బు సర్కారు ఖజానానుండి యిచ్చుచుండవలెను.

''జ్ఞానము లేని వృక్షమునకంటె జ్ఞానము ( బుద్ధి ) గల మానవజన్మ గొప్పదిగదా! వృక్షమును గడ్డతో కొట్టగా ఇరువది నాలుగు గంటలు ఆకలిలేకుండునట్లు రెండు పండ్ల నిచ్చి ఆ బీదవానిని తృప్తిపరచినపుడు, జ్ఞానముగల నన్ను కొట్టినపుడు వృక్షమునకంటె నే నెక్కువగా ఆ బీదవానికి ఉపకారము చేయుటలో గొప్పతన మేమిగలదు ?''

ఈతీర్పును మంత్రులు, నౌకర్లు, రాణీ గారును విని రాజుగారి పాదపద్మములకు మ్రొక్కి, ''ఓ మహారాజా, మీరు దేవతాస్వరూపులు. ఇటువంటి దయ బుద్ధుడు, ఏసుప్రభువు, మొదలగు మహాత్ములే చూపగలరు. మీరు మహాత్ములతో పోల్చదగినవారు. మీవంటి మహారాజులు గల దేశము స్వర్గమయముగా నుండును. ప్రజలు అన్నవస్త్రాదులతోను,

భక్తి జ్ఞాన ధర్మ వైరాగ్యములతోను ఆనందముగానుందురు''
అని స్తోత్రముచేసిరి.

క. ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
అపకారికి నుపకారము
నెపమెన్నక జేయువాడు నేర్పరి సుమతీ.

## క్రోధములేని శాంతమూర్తి ఏకనాథస్వామి

ఒకనాడొక దుర్మార్గుడు ఏకనాథస్వామిపై నూట ఎనిమిది పర్యాయములు ఉమ్మివేసినను నూట ఎనిమిది సారులు నదిలో స్నానముచేసెను. తరువాత ఆ దుర్మార్గుడు తన తప్పులను క్షమించుమని వేడుకొనగా, ''సోదరా, నీమూలకముగా నేను నదిలో నూట ఎనిమిది పర్యాయములు స్నానముచేసి మహాపుణ్య ఫలితము నొందితిని. నా దేహాము పావనమైనది '' అని ఏకనాథస్వామి ఆ దుష్టుని గౌరవించెను.

కథ : ఏకనాథస్వామికి క్రోధము తెప్పించి బాధ గలిగించినవారికి రెండువందల రూపాయల బహుమతి నిచ్చెదమని అసూయాపరులు ప్రకటించగా పలువురు ఏకనాథస్వామికి క్రోధము తెప్పించెదమని వెళ్లి ప్రయత్నించియు విఫలులైరి. చివరి కొక యువకుడు ''నేను ఏకనాథస్వామికి క్రోధము తెప్పించెద'' నని చెప్పి వెళ్లి ఏకనాథస్వామి దైవపూజ చేయుచుండగా ఆయన తొడపై కూర్చొనెను. అపుడు ఏకనాథ స్వామి 'సోదరా, నీవంటి ప్రేమగల మిత్రుని యింతవరకు నేను

చూడలేదు. నాకు దొరకనులేదు' అనెను. వెంటనే యువకుని హృదయము నీరై కరిగిపోయెను. తరువాత ఏకనాథస్వామి దైవపూజా కార్యక్రమమును పూర్తిచేసుకొని భోజనమునకు వెళ్లెను. యువకుడు కూడ ఏకనాథస్వామి ప్రక్కనే భోజనము కొరకు కూర్చొనెను. ఏకనాథస్వామి భార్యవచ్చి అన్నము, కూర వగైరాలను వడ్డించుచుండగా యువకుడు లేచి ఆమె వీపుపై నెక్కి కూర్చొనెను. అపుడు భర్త 'ఆ యువకుడు క్రిందపడకుండులాగున జాగ్రత్తగానుండుము' అనెను. వెంటనే భార్య 'నేను పిల్లలను వీపుపైనుంచుకొని పనులను చేసుకొను నేర్పరితనము గలిగియుంటినిగదా! అందువలన క్రింద పడనీయనులెండి' అనెను. అపుడు యువకుడు క్రిందకు దిగి దంపతుల పాదములపై బడి నమస్కరించి వెళ్లిపోయి, పంపిన అసూయాపరులతో "మీరు రెండువేల రూపాయల నిచ్చినను ఆ ఏకనాథస్వాములవారికి క్రోధము గలిగించుట సాధ్యము కాదు. ప్రశాంతహృదయులగు అట్టిదంపతులను నేను కని ఎరుగను" అనెను.

క. తనకోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబగున్
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ.

శ్లో. సుఖంహ్యావమతః శేతే, సుఖం చ ప్రతిబుధ్యతే
సుఖం చరతి లోకేఽస్మిన్నవమంతా వినశ్యతి. (మనువు)

తా. అవమానింపబడినవాడు సుఖముగా నిద్రజెందును. సుఖముగా మేలుకొనును. సుఖముగా తిరుగును.

నిష్కారణముగా అవమానించినవాడు నాశనము నొందును. అన్యాయము జేసినవాడు దానివలన గలుగు దుఃఖఫలము ననుభవించును.

## భగవంతుని నమ్మినవారే ధన్యులు

పూర్వము ఒకరాజునకు నలుగురు కుమార్తెలు గలరు. అందులో ముగ్గురు కూతుండ్రు తండ్రిని పొగడుచు అన్ని ఐశ్వర్యములకును ఆయనయే కారకుడని చెప్పేవారు. నాలుగవ కుమార్తె మాత్రము సర్వేశ్వరుడే అన్నిటికిన్ని కారకుడని అనెను. అపుడు తండ్రికి చాలాకోపము వచ్చినది. కొన్ని దినములైన తరువాత నాలుగవ కుమార్తెను ఒక నిరుపేద బ్రాహ్మణున కిచ్చి పెండ్లిచేసి "మీరు నా రాష్ట్రములో నుండక వెళ్లిపొం"డని పంపివేసెను.

అపుడు భక్తి వైరాగ్యములతో ఆ దంపతులు ప్రక్క రాజ్యములో నివసించుచు భిక్షమెత్తుకొనుచు జీవించు చుండిరి. ఒకరోజున బ్రాహ్మణునకు ఎక్కడను వెళ్లినను భిక్ష దొరకలేదు. ఇంటిదగ్గర భార్య రిక్తహస్తాలతో ఇంటికి రావద్దని చెప్పియుండుటవలన, ఏమీ తోచక ఆ బ్రాహ్మణుడు త్రోవలో చచ్చిపడియున్న పామును తీసికొని ఇంటికివెళ్లి భార్యకు ఇచ్చెను. అది ఎందుకూ పనికిరాదని ఆమె వీధిలో పారవేసెను.

ఆ సమయములోనే, ఆ దేశపురాజు ఒకకొలనులో స్నానము చేసేముందు విలువైన బంగారపు కంఠహారమును

గట్టునపెట్టి స్నానము చేయుచుండగా మెరయుచున్న నగను ఒక గద్ద చూచి మత్స్యమనుకొని తన్నుకునిపోయి కొంత దూరమేగు సరికి చేపకాదని తెలిసికొని బ్రాహ్మణుని భార్య పారవేసిన చచ్చినపాముదగ్గర పారవేసి పాము కళేబరమును తీసికొని పోయెను. ఆ నగను బ్రాహ్మణుని భార్య చూచి తీసికొనిపోయి భర్తకు యిచ్చెను.

స్నానమైన తరువాత రాజుగారు గట్టున తన కంఠహారము లేకుండుటవలన చాలా చింతపడి "నా కంఠహారమును తెచ్చి యిచ్చినవారికి గొప్పబహుమతి నిచ్చెద" నని చాటింపు వేయించెను. అపుడు ఈ బ్రాహ్మణదంపతులు ఆ కంఠహారమును రాజునకు యిచ్చినారు. అపుడు రాజు "మీ కేమి కావలెను?" అని ప్రశ్న వేసినాడు. బ్రాహ్మణుని భార్య "అమావాస్యనాడు మా ఇంటిలో తప్ప ఈ రాజ్యములోను, మీ రాజభవనములో కూడ దీపం వెలిగించకుండునట్లు ఆజ్ఞాపించవలసిన"దని కోరినది. రాజు అలాగే ఆజ్ఞాపించెను.

అమావాస్యనాడు ( దీపావళిపండుగరోజున ) శ్రీ మహాలక్ష్మి యథాప్రకారముగా రాజ్యములోనికి వచ్చి చూడగా చీకటిమయముగా నుండెను. బ్రాహ్మణ దంపతుల గృహములో మాత్రమే దీపము వెలుగుచుండెను గాన లక్ష్మిదేవి తన్ను పూజించుచున్న బ్రాహ్మణ దంపతుల గృహమునకువచ్చి వారిపై అనుగ్రహము చూపి ఆశీర్వదించి వెళ్లెను. అప్పటినుండి వారి ఐశ్వర్యము అధికముగా పెరిగెను. సుఖముగా ఏ కొరతా లేకుండ జీవితమును గడిపిరి.

ఈ కథలో ఆమె యొక్క భగవద్విశ్వాసము, తల్లి దండ్రాదులను వదలి వెళ్లుటలోగల వైరాగ్యము, నిర్భయత, ఓర్పును, చివరకు మహాఐశ్వర్యవంతురాలగుటయును గమనించవలెను.

సక్కుబాయి, మీరాబాయి, తరికొండ వేంకమాంబ మొదలగు తల్లులు, భగవంతునిపై గల సుదృఢవిశ్వాసముతో దేహముపైని, ప్రాణముపైని అభిమానమును త్యజించి నిందలకు, కష్ట నష్టములకు చలించక విజయమునొందిరి.

---

ప్రశ్న : స్వామీ! సూర్యుడు, చంద్రుడున్ను ఉత్తమ దేవత లేనా ?

ఉత్త : సూర్యుడు అదితి కశ్యపుల కుమారుడు. చంద్రుడు అనసూయ కుమారుడు. లక్ష్మికి తమ్ముడని కూడ చెప్పబడుచున్నాడు.

సూర్యుడు ఆంజనేయునకు నాల్గు వేదములను, శాస్త్రములను బోధించిన పరమగురువు. యాజ్ఞవల్క్య మహర్షికిన్ని గురువు సూర్యుడే యగును. వైవస్వతమనువు, అశ్వనీ దేవతలు, యముడు, శని, సుగ్రీవుడు, కర్ణుడున్ను సూర్యుని పుత్రులు. కాళింది సూర్యుని కుమార్తె. లోకములో ఉపనిషత్తులలో సౌరమతము కలదు. అరసవిల్లియందు (శ్రీకాకుళంజిల్లాలో), కోణార్కయందును (పూరీజగన్నాథం దగ్గర) సూర్యనారాయణాలయములు గలవు.

ఉత్తరదేశములో డెబ్బది సంవత్సరాలక్రితం జయదేవి అను పతివ్రత భర్తతో సహగమనం చేయబోవగా

మునసబు, పోలీసులు అడ్డుపెట్టినను సూర్యభగవానుని ప్రార్థించి అగ్నిని సూర్యుని వలన గ్రహించి భర్తతోపాటు తానున్ను భస్మమయ్యెను.

చంద్రుడు దక్షుని కుమార్తెలగు ఇరువదిఏడు నక్షత్రములకును భర్త యనబడును. ఒకప్పుడు చంద్రుడు శివుని గురించి తపస్సుచేసి తన కున్న వ్యాధిని నివారింపజేసికొనెను.

చంద్రుడు అమృతమును వర్షింపజేయుట వలననే లోకములో పంటలు పండుచున్నవి.

పుణ్యము చేసికొనినవారు వారి వారి పుణ్యము ననుసరించి సూర్య చంద్రాది లోకములకు వెళ్లి ఆనందముగా నుందురనియు, పుణ్యము క్షీణించగానే మరల భూలోకమునకు పంపబడుదురనియును శాస్త్రములు చెప్పుచున్నవి.

మానవులు చేసిన పుణ్య పాపములను చూచి నిర్ణయించునట్టి సాక్షులలో సూర్యుడు, చంద్రుడు, యముడు, కాలము, భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, ఆత్మయు నగు పదిమందిలో సూర్య చంద్రులున్ను గలరుగదా!

సూర్యుని, చంద్రుని, మంగళుని, బుధుని, గురుని, శుక్రుని, శనిని, రాహుని, కేతుని నిత్యమును స్మరించుచుండు వారు ఏవిధమైన కీడును అంటక ఆయురారోగ్యములతో నుందురు.

దేవదానవులు క్షీరసాగరమథనం చేసినపుడు మొదట విషము పుట్టెను. దీనిని శివుడు ధరించెను. తరువాత

అమృతము పుట్టెను. దీని నిమిత్తము దేవదానవులు కలహించుకొనుచుండగా, శ్రీవిష్ణువు మోహినీవేషముతో వచ్చి అమృతమును పంచిపెట్టుచుండునపుడు దేవతలకు అమృతమును, రాక్షసులకు సురను పంచిపెట్టుచుండగా ఒక రాక్షసుడు తెలిసికొని దేవతల పంక్తిలో కూర్చొనెను. అపుడు సూర్యుడు, చంద్రుడున్ను మోహినీరూపముతో నున్న విష్ణువునకు చెప్పిరి. వెంటనే విష్ణువు ఆ రాక్షసుని శిరమును త్రుంచెను. అతని శిరస్సు రాహువనియు, మొండెము కేతువనియును చెప్పబడెను. ఈ చరిత్రవలన సూర్య చంద్రులున్ను దేవతలని తెలియుచున్నదిగదా!

పంచపాండవులు పండ్రెండు సంవత్సరములు వనవాసము చేయుచున్న సందర్భములో ధర్మరాజు సూర్య భగవానుని వేడుకొనగా అక్షయపాత్రను ప్రసాదించెను.

పాండవులు అజ్ఞాతవాసము చేయుటకు విరాటరాజు కొలువులో నుంటున్నపుడు ద్రౌపదిపై విరాటరాజు భార్యా సోదరుడగు కీచకుడు మోహము చూపుచుండెను. ఒకనాడు విరాటరాజు భార్య సుధేష్ణ ద్రౌపదిని కీచకుని ఇంటికి కల్లు తీసికొనిరమ్మని పంపెను. అపుడు ద్రౌపది దుర్మార్గుడగు కీచకుడు ఏమి అనమానము చేయునోయని భయపడుచు, దుఃఖపడుచు భగవంతుని స్మరించుచు, "ఓ సూర్య నారాయణా! నేను నిజమైన పతివ్రతనైతే ఆ కీచకునివలన నాకేమియు కీడు కలుగకుండులాగున కాపాడుము" అని ప్రార్థించెను. అపుడు సూర్యభగవానుడు ఒక రాక్షసుని పంపి ద్రౌపదికి ఆపద సంభవింపకుండులాగున కాపాడెను.

శ్రీకృష్ణుని కుమారుడగు సాంబుడు మొదలైనవారు సూర్యుని ఆరాధించి తమ కుష్టువ్యాధిని పోగొట్టుకొనిరి.

నందీశ్వరుని వలన దెబ్బలు తిని పడిపోయిన దేవేంద్రుడు సూర్యుని పూజించి ఆరోగ్యవంతు డయ్యెను.

నమస్కారః ప్రియో భానుః
ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్.

## దేవతల దర్శనములు

ప్రశ్న : స్వామీ, దేవుడు ఒక్కడేననియు, అతడు సర్వత్ర పూర్ణముగా నిండియున్నాడనియును చెప్పుచుండుట వినుచున్నాను. శివ రామ కృష్ణాదులు దేవత లెట్లగుదురు ?

సమా : నిర్గుణ దేవుడు ఒక్కడే గలడుగాని, సగుణ దేవతలు అనేకమంది గలరు. సగుణ దేవతలను భజించిన వారు మాత్రమే సంసారభ్రాంతులను, కామక్రోధాది దుర్గుణములను జయించి నిర్గుణ పరబ్రహ్మమును పొంద గలుగుదురు. మహాత్ము లందరున్ను దేవతలనుగాని, సద్గురు దేవులనుగాని సేవించియే నిర్గుణ పరమాత్మానుభవము నొందిరి. దేవతలు, సద్గురులు, సద్గ్రంథములు, సాధనలున్ను సగుణములే యగును. నామ రూప క్రియలులేని సత్య జ్ఞానానంద స్వరూపమే నిర్గుణ మనబడును.

ప్రశ్న : పంచమహాభూతములగు భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశమున్ను దేవత లేనా ? మాట్లాడునా ?

సమా : పంచమహాభూతములుకూడ దేవతలే. సందేహాము లేదు.

1. కణ్వ మహర్షి కుటీరములో లేనప్పుడు దుష్యంతుడు శకుంతలను పెండ్లియాడి ఆమెతో భోగించి వెళ్లెను. కొంత కాలమునకు శకుంతల ఒక కుమారుని కనెను. తరువాత శకుంతల దుష్యంతుని ఇంటికి వెళ్లినపుడు "నీవు నా భార్యవు కావు పొమ్ము" అనెను. "నీ భార్యనే' అని ఎంత చెప్పినను దుష్యంతుడు నమ్ముటలేదు. చివరకు ఆకాశవాణి "ఈ శకుంతల నీ భార్యయే, ఇతడు నీ కుమారుడే" యని చెప్పిన తరువాత స్వీకరించెను. ఈ కథవలన ఆకాశము మాట్లాడునని తెలియుచున్నదిగదా !

కంసుడు, తన చెల్లెలగు దేవకీదేవిని అత్తవారింటికి పంపుచున్నపుడు, "ఈమె యొక్క ఎనిమిదవ సంతానము నిన్ను చంపు"నని కంసునితో ఆకాశవాణి పలికెను. విదురుడు తపస్సు చేయుచున్నప్పుడు ధర్మరాజు విదురుని చూచుటకు వెళ్లగా విదురుడు తన శక్తులన్నిటిని ధర్మరాజు శరీరములో ప్రవేశింపజేసి ప్రాణమును వదలెను. అపుడు ధర్మరాజు విదురుని శరీరమును దహనముచేయ దలంచగా దహనము చేయరాదని ఆకాశవాణి తెలిపెను.

2. వాయుదేవుడు హనుమంతునకు తండ్రి యన బడెను. భీష్ముడు ఆంజనేయుని మూడవ అవతారము. భీముడు, హస్తామలకాచార్యులు, మధ్వాచార్యులున్ను వాయు దేవుని అపరావతారములేగదా !

3. అగ్నిదేవుని ఉపాసించునట్టి ప్రవరాఖ్యుడు ఒక నాడు ఒక అరణ్యమును చూడ దలచి ఒక ఇంద్రజాలికుని సహాయముతో పాదములకు పసరురాచుకొని ఆకాశమార్గ మున అరణ్యము జేరి తృప్తికరముగా తిరిగి చూచి తిరిగి ఇంటికి పోదలచి ఆకాశమునకు ఎగుర బోగా పైకి ఎగుర లేక పోయెను. ఎందువల్ల ననగా విశేషముగా అడవిలో తిరుగుటవలన పాదములందు రాచుకొనిన పసరు పూర్తిగా కరిగిపోయినది. అపుడు దుఃఖపడుచు తన ఇష్టదేవత యగు అగ్నిదేవుని ప్రార్థనచేయగా అతడు మానుషా కారముతో వచ్చి ప్రవరుని భుజముపై నెక్కించుకొని ఇంటికి జేర్చెను.

కథ : భోజరాజు బ్రాహ్మణులకు ధనమును దానము చేయుచుండును. ఈవిషయము అగ్నిదేవుని ఉపాసించే దేవశర్మ యొక్క భార్యకు తెలిసినది. అందువలన తన భర్తనుకూడ ధనము నిమిత్తము భోజమహారాజు వద్దకు వెళ్లుమని గట్టిగా చెప్పెను. దేవశర్మ అగ్నిదేవుని పూర్ణ భక్తితో నమ్మియున్నవాడైనను భార్య పోరు పడలేక భోజ రాజువద్దకు వెళ్లి ధనము నడిగెను. అపుడా రాజు ధనమును తీసికొని వచ్చి దేవశర్మకు ఇవ్వబోగా "నాకు ఈ ధనము నివ్వవద్దు. దీనిని నేను తీసికొనను. నీవు స్వయముగా కష్టపడి సంపాదించిన ధనమునే తీసికొనెద"ననెను. అపుడు భోజరాజు "రేపు వచ్చినయెడల స్వయముగా సంపాదించి యిచ్చెద"నని చెప్పి బ్రాహ్మణుని పంపివేసెను. ఆనాటి రాత్రి భోజమహా రాజు కూలివాని వేషము వేసికొని గ్రామములోనికి వెళ్లి సమ్మెట కొట్టువారిని కలిసికొని వారివెంట వెళ్లి తానుకూడ

కమ్మరివానితో “నేనుకూడ సమ్మెట కొట్టెదను. నాకుకూడ కూలి నివ్వవలసిన”దని చెప్పి సమ్మెట కొట్టుచుండెను. భోజరాజునకు అలవాటు లేకపోవుటచేత సరిగా కొట్టనందున ఆ కమ్మరిమేస్త్రీ ఒక పావలా డబ్బుల నిచ్చి పంపివేసెను. ఆ పావలాను భోజరాజు తీసికొని ఇంటికి వెళ్లెను. మరునాడు దేవశర్మ రాగా, భోజరాజు రాత్రి చేసిన పనిని చెప్పి పావలా నిచ్చి పంపెను. దేవశర్మ ఇంటికి వెళ్లి భార్యకు పావలా నిచ్చెను. ఆమె కోపముతో “ఊరిలోని బ్రాహ్మణు లందరున్ను భోజమహారాజు నడిగి వందలకొలది ధనమును తెచ్చుకొనిరిగదా! నీవు పోయి ఒక్క పావలా మాత్రమే తీసికొనివచ్చితివా” యని విసరి పారవేసెను. ఆ పావలా హోమగుండములో పడి బంగారపుకాసు అయ్యెను. దానిని దేవశర్మ తీసికొని సగము నరికి మిగిలిన సగమును హోమగుండములో నుంచెను. అర్ధభాగముతో ఆహార వస్త్రాదులను కొని సుఖముగా జీవనము చేయుచుండెను. ప్రతిదినమును హోమగుండములో నుంచబడిన అర్ధకాసు పూర్ణకాసు అగుచుండెను. అందువలన ప్రతిదినమును సగము నరికి అమ్ముకొని గృహములోనికి కావలసిన ఆహారాది పదార్థములను కొనుచు తోటి బ్రాహ్మణులకంటె విశేషముగా సుఖము ననుభవించుచుండిరి. ఈ పై కథల వలన అగ్నిదేవుడు కూడా తన్ను నమ్మి భజించిన భక్తులను కాపాడుచుండునని తెలిసినదిగదా!

అగ్నిదేవుడే తోటకాచార్యులుగా, వల్లభాచార్యులుగా అవతరించి లోకములో వేదాంతమును ప్రబోధించెను.

ధృష్టద్యుమ్నుడు, ద్రౌపదీదేవియు అగ్నిగుండమునుండి పుట్టిరి. సీతాదేవిని అగ్నిదేవుడు దాచెనుగదా!

4. జలము: గంగ శంతనునకు భార్య అయ్యెను. భీష్మాచార్యులు గంగాపుత్రుడేగదా! భీష్ముని చంపిన అర్జునుని గంగాదేవి శపించుటవలన బభ్రువాహనుడు అర్జునుని చంపెను. తరువాత శ్రీకృష్ణుడు అర్జునుని బ్రతికించెను.

గంగాదినదులు సముద్రుని భార్యలందురు.

కథ: నగలను తయారుచేయుచుండునట్టి విశ్వబ్రాహ్మణుని దుకాణము ప్రక్కనే రవిదాసు అను మాదిగ కులస్థుడు చెప్పులను కుట్టుకొనుచు జీవయాత్ర చేయుచుండెను. ఒకనాడు విశ్వబ్రాహ్మణుడు కాశీయాత్రకు పోదలచి ప్రయాణ మగుచుండగా, మాదిగ రవిదాసు ఒక కాని డబ్బును విశ్వబ్రాహ్మణునకు యిచ్చి "నా పేరు చెప్పి గంగానదీ దేవికి సమర్పించవలసిన"దని చెప్పెను. విశ్వబ్రాహ్మణుడు కొన్ని దినములకు కాశీకి చేరి గంగానదిలో స్నానము చేసి రవిదాసు ఇచ్చిన కాని డబ్బును రవిదాసు పేరు చెప్పి వేయగా నదిలోనుండి బంగారపు కడియము బైటకు వచ్చెను. "దీనిని రవిదాసున కివ్వవలసిన" దను మాటకూడ వినబడెను. విశ్వబ్రాహ్మణుడు అందమైన ఆ బంగారపు కడియమును తీసికొని దురాశగలవాడై కాశీరాజునకు అమ్ముటకు రాజు వద్దకు తీసికొని వెళ్లి యిచ్చెను. రాజు దానిని రాణీగారి కిచ్చెను. రాణి దానిని చూచి అట్టి కడియము నింకొక దానిని తెప్పించి యివ్వవలసినదని రాజుతో చెప్పెను. అపుడు రాజు విశ్వబ్రాహ్మణునితో "ఇంకొక కడియము రెండవ చేతికి తగిలించు

కొనుటకు కావలెనుగాన తీసికొని రమ్ము. రెండు కడియము లకు ఒకేసారి డబ్బు నిచ్చెద"నని చెప్పెను. అపుడు కంసాలి "రెండవ కడియమును తయారుచేయుట నావలన కాని పని గాన నేనిచ్చిన కడియమునకు డబ్బు నివ్వవలసిన"దని కోరెను. అపుడు రాజు కోపముతో "ఇంకొక కడియమును చేసి తీసికొని రానియెడల నిన్ను చంపివేసెద"నని చెప్పెను. వెంటనే విశ్వ బ్రాహ్మణుడు రవిదాసు వద్దకు వచ్చి జరిగిన వృత్తాంతమును, వచ్చిన కష్టమును చెప్పుకొని దుఃఖింపసాగెను. అపుడు రవిదాసు తాను తోళ్లను నానబెట్టునట్టి నీళ్ళతొట్టిలో ఒక కాని డబ్బును వేసి నమస్కారము చేయుమని చెప్పెను. వెంటనే విశ్వబ్రాహ్మణుడు నీళ్లతొట్టిలో కాని డబ్బును వేసి నమస్కరింపగా బంగారపు కడియము పైకి వచ్చెను. దానిని తీసికొని రవిదాసునకు నమస్కరించి రాజుగారికి ఇచ్చి ధనమును తెచ్చుకొనెను. అప్పటినుండి విశ్వబ్రాహ్మణుడు మోసపు కృత్యములను మాని మాదిగ రవిదాసుని గురువుగా నెంచుకొని జీవితమును పావన మొనర్చుకొనెను.

౫. సీతాదేవి భూమినుండి అవతరించి చివరికి భూమి లోనే కలసిపోయెను గదా! తిరుపతి శ్రీవేంకటేశ్వరుని భార్య యగు పద్మావతి ఆకాశరాజునకు భూమిపై దొరికెను. కనుక ఈమె కూడా భూపుత్రిక యనబడెను. ఆండాళ్లమ్మ (గోదాదేవి) కూడా భూపుత్రికయే యగును. భూదేవి లక్ష్మీస్వరూపురా లనబడును.

ఒక స్త్రీ భూమిపై నూనెను పారబోసికొని బాధపడు చున్నపుడు కృష్ణుడు చూచి వచ్చి తడిసిన మన్నును తీసి, పిండి

ఆ స్త్రీకి మానెను తీసి యిచ్చెను. అపుడు భూదేవి "నీ రథము క్రుంగునుగాక." యని శాపమిచ్చెను. అందువలననే యుద్ధ కాలములో కర్ణుని రథము క్రుంగెను.

వశిష్ఠుని నూర్గురు కుమారులను విశ్వామిత్రుడు చంపినపుడు వశిష్ఠుడు పుత్రశోకమును భరించలేక ఆత్మహత్య చేసికొనుటకుగాను పర్వతముపై కెక్కి క్రిందపడుచుండగా భూదేవి కాపాడి "శివుని గురించి తపస్సుచేసిన యెడల ఆయన కృపవలన నీ దుఃఖము శమించు"నని చెప్పెను. అపుడు వశిష్ఠుడు తపస్సు చేసి శ్రీకాళహస్తి క్షేత్రమందు శివుని దర్శనము నొంది దుఃఖమును బాపుకొనెను.

లోకములో విష్ణుభక్తులు, శివభక్తులు, రామభక్తులు, కృష్ణభక్తులు, దేవీభక్తులు, గణేశభక్తులు, సూర్యునిభక్తులు, సుబ్రహ్మణ్యభక్తులు, ఆంజనేయభక్తులు, గురుభక్తులున్ను గలరు. వీరిలో కొందరు ఇష్టదేవతల వలన కోరికల నెరవేర్చుకొనుచున్నారు. కొందరు నిష్కామముగా భజించుచున్నారు. కొందరు సగుణారాధనద్వారా హృదయశుద్ధి గలవారై నిర్గుణ పరబ్రహ్మధ్యానముచేసి అఖండాత్మానుభూతి నొందుచున్నారు.

శ్లో. "మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రాస్తేఽపియాంతి
పరాంగతిమ్."

తా. స్త్రీలైనను, వైశ్యులైనను, శూద్రులైనను భగవంతుని స్మరించుచున్నచో పాపాత్ములైనను మోక్షము నొందెదరు.

కథ: పూర్వము శ్రీకాళహస్తిలో ఒకరాజుగారికి సేవచేసే ఒకదాసి యుండెను. ఆమె శివభక్తురాలు. ఈ విషయం ఇతరుల కెవ్వరికిన్ని తెలియదు. ఒకనాడు పరమేశ్వరుడు ఆ భక్తురాలి యొక్క భక్తిప్రభావమును ప్రకటనచేయవలెనను తలంపుతో బిచ్చగాని వేషముతో రాజుగారు భోజనముచేయుచున్న సమయమున వచ్చి తన భక్తురాలిని పిలిచి భిక్షము వేయుమని చెప్పి మాయమాటలతో రాజుగారి భవనమునకు దూరముగా తీసికొనివెళ్లి చాలాసేపు తన్మయత్వము గలిగించే ధర్మములను చెప్పి పంపెను. దీని వలన రాజుగారి యెంగిలిపళ్ళెమును కడుగుటకు ఆలస్యమైనది. అపుడు రాజుగారు చాలా కోపము తెచ్చుకొనినవాడై మంగలివానిని రప్పించి ఆ పరమశివభక్తురాలగు దాసీ శిరమునగల వెంట్రుకలను గొరిగింపజేసెను. రాజు చేయించిన శిక్షణకు భక్తురాలగు దాసి బాధపడుచు పరమేశ్వరుని విశేషముగా ధ్యానించుచుండెను. పరమేశ్వరుని కృపవలన తెల్లవారుసరికి ఆ భక్తురాలి శిరమున యథాప్రకార ముగా వెంట్రుకలు మొలచి యుండెను. ఈ మహిమను రాజుగారు చూచి దాసీగాయున్న శివభక్తురాలికి నమస్క రించి ఆనాటినుండి ఆ భక్తురాలితో ఏలాటి పనిని చేయ నీయక జీవితపర్యంతము పోషించుచు సాధుమాతగా గౌరవించిరి. చివరకు ఆ మహాతల్లి శివునియందు ఐక్య మయ్యెను.

ఈ కథవలన మోక్షము నొందుటకు అంతరంగ భక్తి, జ్ఞాన, వైరాగ్యములు కారణము లగునేగాని స్త్రీపురుష భేదములుగాని, కలిమిలేములుగాని, పాండిత్యాపాండిత్య

ములుగాని, వర్ణాశ్రమములుగాని కారణములుకావని తెలియు చున్నదిగదా!

కథ : దక్షిణమధురానగరమున పిట్టువాణి అమ్మ యార్ అను శివభక్తురాలు కలదు. ఆమె ప్రతిదినమును ఆవిరి కుడుములను (ఇడ్లీలను) అమ్ముకొని జీవించుచుండెను. ఒకనాడు మధురానగరమునకు ప్రక్కన ప్రవహించుచున్న నది పొంగి నగరములోనికి రాబోవుచుండెను. అందువలన మధురను పరిపాలించుచున్న రాజుగారు నగరములోగల ఇంటి కొక్కొక్కరు వచ్చి కట్టపోయవలసినదని చాటింపు వేయించెను. అపుడు ఇంటి కొక్కొక్కరు వచ్చి కట్ట పోయుచుండిరి. మన పిట్టువాణి అమ్మయార్ "మనము మనిషిని పంప లేదుగదా! నాయింటిలో నేను తప్ప పురుషు లెవ్వరు లేరుగదా! కూలి వానిని పంపుదామనుకొన్నను మనకు డబ్బులేదు. కూలి వాడు దొరకడు. మన ఇంటివంతు ఒకమనిషిని పంపనిచో రాజుగారికి కోపము వచ్చునేమోగదా" యని పరిపరివిధము లుగా చింతించుచుండెను. అప్పుడే భక్తసంరక్షణ కంకణ ధారియైన పరమశివుడు కూలివాని వేషముతో భుజమున పార పెట్టుకొనివచ్చి "అమ్మా, మీకు కూలివాడు కావలెనా? నేను కూలిపని చేసెదను" అని అడుగగా అపుడు పిట్టువాణి "కావ లెను నాయనా. నావద్ద పైసా కూడ లేదు. ఆవిరి కుడుములు మాత్రమే కలవు" అనెను. అపుడు కూలివాని రూపమున నున్న శంకరుడు "అమ్మా! నాకు డబ్బు నివ్వనవసరము లేదు. కడుపునిండుగా కుడుముల ముక్కలు పెట్టిన చాలు"నని చెప్పి కుడుములు పెట్టించుకొనునపుడు అక్షయ కుడుము లగు చుండెను. కడుపునిండుగా తిని కట్టపోయుచున్న వారిదగ్గరకు

వెళ్ళి అక్కడనే పార శిరస్సుక్రింద పెట్టుకొని పరుండి పాటలు పాడుచుండెను. కొంతసేపటికి రాజుగారు కట్ట సరిగా పోయుచున్నారో లేదో చూచుటకు వచ్చిరి. అపుడు కట్టపోయువారు "అయ్యా, ఈ కూలివాడు పిట్టువాణి అమ్మయార్ పంపించగా వచ్చినాడు. పనేమియుచేయక పరుండి రాగములు తీయుచున్నాడు. అతని భాగము కట్టపోయక మిగిలియున్నది" అని చెప్పిరి.

అప్పుడు రాజుగారు కోపముతో మంచి బెత్తమును తీసికొని బాగుగా కొట్టెను. ఆ దెబ్బ అక్కడున్న వందల కొలది జను లందరికిన్ని తగిలినది. దీనితో చాలా బాధపడిరి. కూలివాని రూపముతోనున్న పరమశివుడు మాయమయ్యెను. అపుడు రాజుగారు కూలివాని నంపిన అమ్మగారిని చూచుటకు వెళ్ళగా ఆ పిట్టువాణి అమ్మయార్ అపుడే విమానము నెక్కి కైలాసమునకు వెళ్ళుచుండెను. అపుడు రాజుగారు నమస్కరించి పరమభక్తుల యొక్కయు, దేవునియొక్కయు మహిమాతిశయమును ఆశ్చర్యముతో వర్ణించుకొనుచు ఇంటికి వెళ్ళెను.

ఈవిధముగా భగవద్భక్తిగల గజేంద్రుడు, ఉడుత, జటాయువును మోక్ష మందినట్లు చరిత్రలు కలవుగదా! చిదంబర క్షేత్రములో ఒక మహాత్ముడు వృక్షమునకు మోక్షమిచ్చినట్లు చరిత్ర కలదు. శ్రీకాళహస్తిలో సాలెపురుగునకు, సర్పమునకు, ఏనుగునకును పరమశివుడు మోక్ష మిచ్చినట్లు చరిత్రకలదు గదా! నీతి, ధర్మవర్తనము, భక్తిజ్ఞానవైరాగ్యములున్ను గలవారు ఎవరైనను ఈలోకమునందు, పరలోకమునందును గౌరవింపబడుదురు. సుఖపడుదురు.

# జ్ఞానములేని భక్తి, భక్తిలేని జ్ఞానము

కథ : ఒకనాడు శ్రీరాముని దర్బారులో విశ్వామిత్రాది మహర్షులు కూర్చొని యుండగా ఒక యువరాజు శ్రీరాముని దర్శనార్థము వచ్చి శ్రీరామునకు నమస్కరించి వెళ్లెను. అపుడు విశ్వామిత్రుడు లేచి, "రామా, నీ దర్బారులో ఋషులకు అవమానము జరుగవచ్చునా" యని అడిగెను. వెంటనే రాముడు "అవమానమేమి జరిగినది మహాత్మా?" యని భయపడుచు ప్రశ్నించెను. "ఆ యువరాజు ముందుగా మాకు నమస్కారము చేయక నీకు మాత్రమే నమస్కరించి వెళ్లెను గదా" యని విశ్వామిత్రుడు చెప్పగానే, శ్రీరాముడు ఆ యువరాజు మరల వచ్చినపుడు చంపివేసెద నని చెప్పెను. అపుడు నారదుడు యువరాజును తీసికొని వచ్చి అంజనాదేవికి నమస్కారము చేయించెను. ఆమె యువరాజును శ్రీరాముని దగ్గరకు తీసికొని వెళ్లుమని ఆంజనేయునితో చెప్పెను. హనుమంతుడు యువరాజును రాముని దగ్గరకు తీసికొని వెళ్లి, "శ్రీరామ, శ్రీరామ, శ్రీరామ యని స్మరణ చేసికొనుచు కూర్చుండు" మని చెప్పి కూర్చొనబెట్టెను. అపుడు శ్రీరాముడు యువరాజును చంపుటకు బాణములు వేసెను. ఎన్ని బాణములు వేయుచున్నను యువరాజునకు తగులక ముందు పడి పోవుచుండెను. ఈ ప్రభావమును విశ్వామిత్రాది మహర్షులు చూచుచు ఆశ్చర్యపడి తమ గర్వమును అణచుకొనిరి.

ఈ కథవలన విశ్వామిత్రుడు శివభక్తుడుగా యున్నను, జ్ఞానము లేకపోవుటచేత "నేను, నీవు" యను భేద బుద్ధితో గర్వము జెందెనని తెలియుచున్నదిగదా!

కథ : జనకమహారాజు సభలో ఋషులు కూర్చొని యుండిరి. అప్పుడే ఎనిమిది వంకరలుగల అష్టావక్రమహర్షి వచ్చుచుండుట ఋషులు చూచి 'అష్టవంకరలు గల ఈయన కూడ ఋషియేనా' యని నవ్విరి. అందుకు అష్టావక్రుడు కూడ నవ్వెను. 'నీ వెందుకు నవ్వుచున్నా'వని ఋషులు ప్రశ్నించగా, 'నాలో గల ఆత్మను చూడక, నా దేహమును చూచుచుండునట్టి మీరుకూడ ఋషులేనా యనుకొని నవ్వు చున్నా'నని అష్టావక్రమహర్షి చెప్పెను. అపుడు ఋషులు "మనము భక్తులమే గాని, ఆత్మవిజ్ఞానులము కాలేదు' యని తమ తప్పును తామే తెలిసికొని సిగ్గుజెందిరి.

జ్ఞానములేని భక్తులకు భేదబుద్ధి యుండును.

కథ : ఉద్ధవుని అపరావతారుడగు నామదేవుడు ఘోరాకుంభారుదాసు చేయుచున్న విందుకు వెళ్లి భోజన పంక్తిలో కూర్చొనెను. అపుడు జ్ఞానదేవుడు, 'ఘోరా కుంభారుదాసుగారూ! ఈ కుండలలో గట్టికుండయేదో, ఓటి కుండ యేదో చెప్పు'డని అడుగగా ఘోరాకుంభారు ఒక త్రెడ్డును తీసికొని వరుసగా నెత్తిని కొట్టుచు పోయి చివరగల నామదేవుని నెత్తిని కొట్టగా క్రోధము గలవాడై 'విందుకు రమ్మని నన్ను కొట్టెదవా' యని విస్తరిదగ్గరనుండి భోజనము చేయకుండగనే లేచి, నేరుగా దేవాలయమునకు పోయి శ్రీపాండురంగనికి చెప్పుకొనెను. వీనికి భక్తిగలదేగాని సమత్వజ్ఞానములేదని పాండురంగడు తెలిసికొని 'శ్రీశైల ములో గల ఒకమహాత్ముని దగ్గరకు వెళ్లు' మని చెప్పి పంపెను.

అపుడు నామదేవుడు శ్రీశైలదేవాలయమునకు వెళ్లగానే అక్కడున్న మహాత్ముడు శివలింగముపై రెండు కాళ్లను పెట్టుకొని పరుండి 'నామా, నిన్ను నాదగ్గరకు పాండురంగడు పంపినాడా' యని అనెను. వెంటనే నామదేవుడు ఆశ్చర్యముతో దగ్గరకువచ్చి చూచి 'రామ రామ, శివ శివ, దేవునిపై కాళ్లను పెట్టుట మహాపాప'మనెను. అపు డా మహాత్ముడు 'నామా, నేను వృద్ధుడను. నీవే నా కాళ్లను ప్రక్కకు దింపి పెట్టు' మనగానే నామదేవుడు ఆ మహాత్ముని పాదములను పట్టుకొని ఎచ్చట పెట్టినను శివలింగములు పాదముల క్రింద కనబడుచుండెను. చివరకు విసుగుజెంది వదలివేసెను. అపుడా మహాత్ముడు నామదేవునకు సర్వత్రా దేవుడు నిండియున్నాడని బ్రహ్మోపదేశము చేయగా, నామదేవుడు గురువుదగ్గర సెలవుపొంది ఇంటికి వెళ్లిపోయెను. కొన్ని దినములకు పాండురంగడు వచ్చి 'నామా, నాదగ్గరకు రావడములేదేమి' యని ప్రశ్నించగా, 'ఇదివరకు నీవు దేవాలయములోనే వున్నట్లు నమ్మియుంటిని. ఇపుడు సద్గురూపదేశమువలన సర్వత్ర నీవు నిండియున్నట్లు నేను అనుభవము నొందియుంటిని. కాన దేవాలయమునకు రావలసినపని నాకు కనుపించుటలే'దని నామదేవుడు భక్తితో చెప్పుకొనెను. అపుడు పాండురంగడు, 'నామా, ఇపుడునీవు నా నిజతత్త్వమును గ్రహించితి'వని చెప్పి వెళ్ళెను.

ఈ కథవలన నామదేవుడు భక్తిభావములో నున్నంతవరకును అహం మమతలతో, స్తుతి నింద, సుఖ దుఃఖ భేదములతో నుండెననియు, జ్ఞానోపదేశముతో భేదదృష్టి నశించెననియు దెలియుచున్నదిగదా!

కథ : శ్రీరామకృష్ణపరమహంసగారు మొదట కాళికాదేవిమూర్తిపై విశేషభక్తి నుంచి జప ధ్యాన సమాధులతో తన్మయత్వము జెందుచుండెడివాడు. కొంత కాలమునకు దేవి తోతాపురి యను ఒకగురువును పంపినది. ఈయన సగుణదేవతలను నమ్మడు. నిర్గుణపరబ్రహ్మమే సత్యమని బోధించుచుండును.

శ్రీరామకృష్ణునకు నిర్గుణముపై నమ్మకము, దృష్టియు నిలుచుటలేదు. ఒకనాడు తోతాపురి ఒకగాజు ముక్కను తీసికొనివచ్చి శ్రీరామకృష్ణుని కనుబొమ్మల మధ్య రక్తము వచ్చునట్లు గ్రుచ్చి అచట దృష్టిని పెట్టుమని చెప్పగా శ్రీరామకృష్ణుడు భ్రూమధ్య దృష్టినుంచి నిర్వికల్ప సమాధి సుఖము నొంది నాదేవి సగుణము, నిర్గుణము నైయున్నదని నిశ్చయించుకొనెను.

ఈ కథవలన ఎన్నిజన్మలకైనను సచ్చిదానంద నిర్గుణ పరబ్రహ్మానుభవము కలుగనంతవరకును అక్షయ (అఖండ) మోక్షసుఖము గలుగదని తెలియుచున్నదిగదా!

కథ : సర్వము దైవస్వరూపమే యని గురువు బోధించగా ఒక శిష్యుడు విని ఇంటికి వెళ్ళుచుండగా మావటివానితో ఏనుగు వచ్చుచుండెను, అదియు భగవత్స్వరూపమే నని తలంచి మావటివాడు తప్పుకొనుమని చెప్పినప్పటికిన్ని తప్పుకొనక ఎదురుగా వచ్చెను. అపుడా ఏనుగు తొండముతో పట్టుకొని ప్రక్కకు విసరివేసెను. దానితో శిష్యునకు దెబ్బలు తగిలినవి. తిరిగి వెంటనే గురువు దగ్గరకు వెళ్ళి చెప్పుకొనగా "ఏనుగును దైవముగా

చూచినను మూవటివానిని, వాని మాటలను దైవస్వరూప ముగా నెంచి వర్తించనందున నీకీ శిక్ష దేవుడు విధించె''నని గురువు బుద్ధిచెప్పెను.

ఈ కథవలన జ్ఞానములేని మూఢభక్తివలన బాధలు తప్పవని తెలియుచున్నది. వ్యవహారములో మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షలను దృష్టిలో నుంచుకొనవలెనని పెద్దలు చెప్పిరిగదా!

కథ : ఒక ఊరిలో ఒక భక్తుడు దేవుని పూజించు చుండగా ఒక బిచ్చగాడు వచ్చి పొమ్మని చెప్పుచున్నప్పటికి మాటిమాటికి బిచ్చము పెట్టవలసినదని కేకలు వేయుచు అడుగుచుండెను. అపుడు భక్తునకు కోపము వచ్చినది. బైటకువచ్చి కఱ్ఱ తీసికొని బిచ్చగానిని కొట్టి గ్రామము వెలుపలకు లాగుకొనిపోయి విడిచి వచ్చి పూజాగదిలోనికి వచ్చి చూడగా దేవుని విగ్రహాము తునకలై యుండెను. అపుడు భక్తుడు భయమును, దుఃఖమును జెంది తప్పు క్షమించ వలసినదని దేవుని వేడుకొని బిచ్చగాని నిమిత్తము ఊరి బైటకు పోయిచూడగా కనుపించలేదు. భగవంతుడే భూతదయ, పరోపకారబుద్ధి, సర్వభూతములలోను దేవుడున్నాడనెడి విజ్ఞాన మును కలిగించుటకుగాను వచ్చినాడని తెలిసికొని దేవుని పశ్చాత్తాపముతో పదేపదే వేడికొనగా యథాప్రకారముగా దేవుని విగ్రహాము నిలిచియుండెను. అప్పటినుండి భక్తుడు సమత్వబుద్ధితో వర్తించుచుండెను.

ఈ కథవలన భూతదయలేని భక్తి, వేదాంత శాస్త్ర జ్ఞానమును రాక్షసులకుగల భక్తివంటిదని, అసురులకు గల వేదపఠన జ్ఞానములతో తుల్యమనియు తెలియుచున్నదిగదా!

# భక్తిలేని జ్ఞానము

కథ : జ్ఞానముగల దుర్వాసుడు భక్తిగల అంబరీషునికి బాధ గలిగించెను. అపుడు అంబరీషుడు శ్రీహరిని ప్రార్థన చేయగా చక్రమును పంపెను. అది దుర్వాసుని చంపుటకు వెంటబడెను. దుర్వాసుడు మూడులోకములలో గల బ్రహ్మ విష్ణుమహేశ్వరాది దేవతలను రక్షించవలసినదని ప్రార్థించగా "నిన్ను రక్షించు శక్తి మాదగ్గరలేదు. కాన తిరిగివెళ్లి పరమభక్తుడగు అంబరీషుని శరణుపొందు"మని చెప్పగా తిరిగివచ్చి అంబరీషుని శరణు వేడుకొనెను. అంబరీషుడు చక్రమును వెళ్లిపొమ్మని వేడుకొనగా తిరిగి శ్రీహరిని చేరెను. ఈ కథవలన భక్తిలేని జ్ఞానములో అహంకారము, క్రోధము నుండుననియు, పరమభక్తుడే భక్తిలేని జ్ఞానికంటె గొప్పవాడనియు తెలియుచున్నదిగదా!

కథ : శ్రీ శంకరాచార్యులు జ్ఞానముగలవాడైనప్పటికిన్ని శాక్తేయమతస్థులతో "దేవి యనునది లేదు, అద్వైత పరబ్రహ్మమొక్కటే గల"దని వాదించెను. అపుడు దేవికి కోపము వచ్చినందువలన శంకరులు శిష్యులతో ప్రయాణమై పోవుచుండగా పెద్ద గాలివాన దేవి తెప్పించెను. దానితో శిష్యులు నలువైపులకును కొట్టుకొనిపోయిరి. శంకరులు బురదగుంటలో రొమ్మువరకును దిగబడి బైటకురాలేక దుఃఖపడుచు

గీ. "తెలియ కెవ్వరినైన నిందించి యిట్టి
వెతలగాంచితినేని, సద్వృత్తి నిపుడు
మాన్పికొనియెద నా బుద్ధిమాంద్యమెల్ల
వేగ రక్షింప రయ్యయో వేల్పులారా"

అని వేడికొనగా, దేవి వృద్ధవనితగ కఱ్ఱ చేతబూని శంకరుని దగ్గరనుండి వెళ్లుచుండగా, 'ఓ తల్లీ, నేను గాలికి ఈ బురదగుంటలో దిగబడితిని. నీ చేతికఱ్ఱ నిమ్ము, మరల నిచ్చెద'నని అర్థించెను. 'నీవు యువకుడవు. మరల నా కఱ్ఱ నాకు యివ్వనిచో అపుడు నే నేమి కావలెను' అని దేవి పలుకగా, 'తిరిగి యిచ్చెద'నని శంకరులు ప్రతిమాలెను. వెంటనే దేవి నిజస్వరూపమును చూపి 'నేను లేనని వాదించితివి గదా, అందువలన నీకీ శిక్ష వేసితి'నని చెప్పి అంతర్థాన మాయెను.

ఈ కథవలన భక్తిలేని జ్ఞానముచే ప్రమాదములు సంభవించునని తెలియుచున్నదిగదా!

కథ : ఆంధ్రదేశములో తిరుపతి వేంకటేశ్వరస్వామి ప్రసిద్ధివహించియున్నట్లు, మలయాళ దేశములో గురువాయురప్పన్ అను దేవుడు ప్రసిద్ధి వహించి యుండును. శంకరాచార్యులు యాత్రచేయుచు గురువాయురప్పన్‌ను దర్శించకుండ తప్పుకొని పోవుచు ఒకచోట పడిపోయి కొంతసేపు స్పృహలేకుండనుండి లేచి దేవుని దర్శించని దోషమువలన పడిపోతినని గ్రహించి దేవుని దగ్గరకువెళ్లి పలువిధములుగా స్తుతించి, పూజావిధానమును ఏర్పాటుచేసి వెళ్లెను.

ఈ కథవలన సగుణదేవునిపై అసూయగలవారు ఆపదల నొందుదురని తెలియుచున్నదిగదా!

కథ : శ్రీరామకృష్ణపరమహంస గురువు తోతాపురి శిష్యునితో దేవి యను సగుణరూపము మిథ్యయని వాదించెను. అందువలన నా గురువుగారికి సగుణదేవునిపై భక్తి గలుగునట్లు చేయవలసినదని శ్రీ రామకృష్ణ పరమహంస

దేవిని ప్రార్థించెను. అపుడు దేవి గురువుగారికి భరింపరాని బాధతో గూడిన వ్యాధిని రప్పించెను. అపుడు గురువు ఆత్మహత్య చేసికొనుటకు గంగానదిలో దూకెను. గంగ మోకాళ్లలోతుగల నీళ్లతోనుండుటచే ఆశ్చర్యపడి చూచు చుండగా ఎటుచూచినను దేవి కనబడుచుండెను. అపుడు తన తప్పును తెలిసికొని దేవిపై భక్తిగలవాడాయెను.

ఈ కథవలన సగుణదైవమును దూషించినచో కష్టములు కలుగునని తెలియుచున్నదిగదా!

## కర్మ (పని) గొప్పదా? భావన గొప్పదా?

శ్లో॥ మనః కృతం కృతం రామ నశరీర కృతం కృతమ్.

తా: రామా, మనస్సు చేసిన కర్మయే నిజమైన కర్మ యగునుగాని శరీరము చేసినపని నిజమైన పనికాదు.

కథ: శ్రీకృష్ణతులాభారములో గర్వముతో వేసిన సత్యభామ నగలకంటె భక్తితో వేసిన రుక్మిణీదేవి తులసీ దళమె బరువైనట్లు తెలియుచున్నదిగదా! కనుక శరీరముతో చేయబడుచుండు మంచి చెడు కర్మలకంటె వాక్కుతో మాట్లాడబడు మంచి చెడు మాటలకంటె మనస్సులో గల మంచికి మంచి ఫలితమును, చెడుభావమునకు (చెడ్డగుణమునకు) చెడు ఫలితమున్ను గలుగునని గ్రహించవలెను.

లోకములో అనేకమంది సన్న్యాసులు సంసారులకంటె అపవిత్రులగుచున్నారు. అనేకమంది గృహస్థులు, బ్రహ్మచారులు సన్న్యాసులకంటె గొప్పవారగుచున్నారు.

ఇట్లే అనేకమంది పండితులు చదువులేనివారికంటె నీచు లగుచున్నారు. అనేకమంది చదువులేనివారు సత్ప్రవర్తన, సద్గుణములతో మహాపవిత్రులని కీర్తింపబడు చున్నారు.

సద్గుణములను బట్టియే కటికదరిద్రులుకూడ కోటీశ్వరులకంటె అనేకరెట్లు కీర్తివంతులు, పూజనీయులు, సుఖవంతులు నగుచున్నారు.

కథ : రావణాసురుడు సన్న్యాసివేషము వేసికొనివచ్చి సీతాదేవిని తీసికొనిపోయెను.

కథ : అర్జునుడు సన్న్యాసివేషము వేసికొనివచ్చి సుభద్రను తీసికొనిపోయెను.

వేషము పవిత్రమైనదైనను భావన చెడ్డదేగదా !

కథ : ఒకఊరిలో ఒకభక్తుడు ప్రతిదినమును దైవపూజ చేయుచుండును. ఒకనాడు భక్తునితో పనిగలిగి ఒకమనిషి వచ్చి భక్తుని కుమారుని "మీ నాన్నగారున్నారా ?" అని అడిగెను. అపుడు తండ్రి పూజాగదిలో పూజచేయుచు నున్నప్పటికిన్ని 'మా నాన్న మాదిగగూడెము వెళ్ళె'నని కుమారుడు చెప్పెను. అంతట వెంటనే వచ్చిన మనిషి వెళ్ళెను. తండ్రి పూజాగదిలోనుండి వచ్చినతరువాత కుమారుడు తండ్రితో, "నాన్నా, నీకొరకు ఎవరో వచ్చి 'మీ నాన్న వున్నాడా' యని అడిగెను. అందుకు నేను మా నాన్న మాదిగగూడెమునకు వెళ్ళె" నని చెప్పితి ననెను. అపుడు తండ్రి "అబద్ధముచెప్పుట తప్పుగదా !" అనెను. అంతట కుమారుడు 'నీవు గదిలో పూజచేయుచున్నప్పటికి నీ మనస్సు మాదిగవాని ఇంటికివెళ్లి చెప్పులు కుట్టినాదో

లేదో యని చింతించుచున్నదిగదా!" అనెను. అపుడు తండ్రి కుమారునియొక్క పరచిత్తజ్ఞానమునకు మిక్కిలి ఆశ్చర్యపడి తన తప్పునకు పశ్చాత్తాపమొందెను.

ఈ కథవలన, బాహ్య వేష భాష క్రియలను చూచి గొప్పతనమును నిర్ణయించుకొనగూడదనియు, హృదయ శుద్ధియే ప్రధానమైనదనియు నిశ్చయించుకొనవలెను.

కథ: అహల్యాబాయి యను భక్తురాలు ప్రతిదినము దైనపూజ, భగవన్నామసంకీర్తన, జపధ్యానములు చేయుచుండును. భర్తకు భగవన్నామస్మరణచేయుమని అనేకపర్యాయములు చెప్పినను అతడు మౌనము వహించుచుండెను. అందుకు భార్య చాలా బాధపడుచుండెను. నిజముగా భార్యకంటె భర్తయే దేవునిపై అనన్య భక్తి నుంచుకొని స్మరణచేయుచు ఇతరులకు తెలియనీయక వర్తించుచుండెను. ఇట్లుండగా ఒకనాడు భర్త నిద్రలో 'శ్రీరామా' యనెను. ఆ శబ్దమును భార్య విని అంతులేని సంతోషమునొంది తెల్లవారిన తరువాత ఉదయమున గృహమునకు, గ్రామమునకును అలంకారములు చేయించి, పెద్దగా దైవపూజలు, సమారాధనలను ప్రారంభించెను. ఇదంతయు భర్తచూచి "ఈదినము ఇట్లు చేయుటకు కారణమేమి" యని గట్టిగా అడిగెను. అపుడు భార్య నిద్రలో జరిగిన వృత్తాంతమును చెప్పగా, "అయ్యో! ఎంతోకాలమునుండి గుప్తముగా దాచుకొని యుంచుకొనిన భగవన్నామస్మరణ యనెడి నిధి బైటపడినదిగదా!" యని ప్రాణమును వదలెను.

ఈ కథవలనకూడ అంతరంగభావన గొప్పదని తెలియుచున్నదిగదా!

కథ: పదునారువేల గోపికాస్త్రీలతో నుండెడి శ్రీకృష్ణభగవానుడు ఒకనాడు రుక్మిణీ సత్యభామలతో, 'నేను అస్ఖలిత బ్రహ్మచారి' నని చెప్పెను. ఆమాటపై వారికి నమ్మకము కలుగుటకై గంగానది ఆవలి గట్టునగల అగస్త్య మహర్షికి ఫలహారములను తీసికొనివెళ్లి ఇవ్వవలసినదని రుక్మిణీ సత్యభామలను పంపెను. వారు నది దగ్గరకు వెళ్ళి చూడగా, వెళ్ళుటకు వీలుకాకుండునట్లు నదిపొంగి ప్రవహించు చుండుటచే తిరిగి వచ్చిరి. అపుడు భగవానుడు 'అస్ఖలిత బ్రహ్మచారి దారి నిమ్మని చెప్పుడని చెప్పినారని చెప్పు'డనగా తిరిగి రుక్మిణీ సత్యభామలు వెళ్ళి గంగతో చెప్పగానే, దారి నిచ్చెను. అపుడు ఇరువురున్ను అగస్త్యమహర్షిదగ్గరకు వెళ్ళి ఫలహారములను ఇచ్చి భుజింపజేసి సెలవుతీసికొని గంగ దగ్గరకు రాగా పొంగి ప్రవహించుచుండెను. అపుడు రుక్మిణీ సత్యభామలు ఋషిదగ్గరకువెళ్లి చెప్పుకొనిరి. 'నిత్యోపవాసి అగస్త్యులవారు దారి నిమ్మని చెప్పినారని చెప్పుడు' అని ఋషి చెప్పి పంపెను, అపుడు వా రిరువురు వచ్చి చెప్పినతరువాత గంగ దారి నిచ్చెను. అప్పటినుండి రుక్మిణీ సత్యభామలు శ్రీకృష్ణ భగవానుడు అస్ఖలిత బ్రహ్మచారి యనుట నిజమే ననియు, అగస్త్యమహర్షి నిత్యోపవాసి యనుటయు నిజమే ననియు గ్రహించిరి. ఈ కథవలన దేహ దృష్టి (దేహమే నేను అను నిశ్చయము) గలవారికి కర్మల దోషములు అంటు ననియు సర్వాత్మభావన గలవారికి ఏ దోషమున్ను అంటదనియును నిశ్చయించుకొనవలెను.

దేవుడు ధర్మమునకు, అధర్మమునకును విలక్షణుడు. పూర్ణముగా దేవుని నమ్మినవారికి పుణ్య పాప దోషము లంటవు.

శబరి శ్రీరామునకు ఎంగిలిచేసి రేగిపండ్లను పెట్టినను, శ్రీకాళహస్తిలో కన్నప్ప శివునకు మాంసమును పెట్టినను, శ్రీరామకృష్ణ పరమహంస దేవీప్రసాదమని భుజించినను పాపదోషము నంట కుండెరి.

కథ : ధర్మరాజు ధర్మమునందు విశ్వాసముగల వాడేగాని, దేవునివాక్యముపై విశ్వాసముగలవాడు కాడు. అర్జునుడు మాత్రము భగవానునిపై విశ్వాసముగలవాడై యుండెను. శ్రీకృష్ణభగవానుడు యుద్ధసమయములో ధర్మరాజుతో "అశ్వత్థామ హతః కుంజరః" అని అనుమని చెప్పినపుడు పూర్తివాక్యమును స్పష్టముగా పలుకక, అసత్యము పలుకుచున్నానే యను సంశయముతో సగము వాక్యము బిగ్గరగాను, మిగిలిన సగము నిదానముగా అస్పష్టముగా పలికినందున దోషము వచ్చినది. అందువలన ధర్మరాజు స్వర్గారోహణ చేయుటకు వెళ్లుచున్నపుడు నరకమును చూడవలసివచ్చెనుగదా! ఈ చరిత్రలవలన కూడ భావన గొప్పదిగాని క్రియగొప్పది కాదని నిశ్చయించుకొనవలెను.

ప్రశ్న : స్వామీ, శ్రీరాముని భార్యయగు సీతాదేవిని రావణాసురుడు తీసికొనిపోవుట పాపకర్మ యగునని చెప్పుట బాగుగానే యున్నది. ఇట్లే దేవగురువగు బృహస్పతి భార్య తారతో చంద్రుడు రమించి బుధుని కనుట పాపకర్మ యనుటయు బాగుగానే యున్నది. కాని, హరిశ్చంద్రుని భార్యయగు జయతో శివుడు రమించి నందీశ్వర, భృంగీశ్వరు లను సంతానమునుకూడ గలిగించుట పాపకర్మకాదా?

ఉత్త: శివుడు హరిశ్చంద్రుని భార్యయగు జయతో రమించుట దోషమైనపని కాదు. ఎందువలన అనగా, జయ పూర్వజన్మము పార్వతీదేవియొక్క చెలికత్తె యనబడును. దక్షయజ్ఞసమయములో సతీదేవి మరణించిన తరువాత చెలికత్తె శివుని వివాహమాడగోరి తపస్సు చేయుచుండెను. ఈవిషయమును సతీదేవి పార్వతిగా పుట్టిన తరువాత తెలిసికొని క్రోధముగలదై 'భూలోకమునకు పోయి పుట్టెదవు గాక' యని శపించెను. అందువలన ఆమె భూలోకమున పుట్టి హరిశ్చంద్రునకు భార్య యయ్యెను. ఒకనాడు శివుడు కాశీక్షేత్రమునకు వచ్చి రహస్యముగ జయదగ్గరకు వచ్చి ఆమెతో రమించి వెళ్ళెను. అందువలన ఆమెకు ఇరువురు బిడ్డలు పుట్టిరి. వీరిని హరిశ్చంద్రుడు చూచి, మంత్రిని పిలిపించి 'ఈ బిడ్డలు నాకు పుట్టిన ఆకారములతో కనబడుట లేదు. శివుని ఆకారములు ఈ బిడ్డలయందు కనబడుచున్న'వని చెప్పగా, మంత్రికూడ నట్లే నిశ్చయించుకొని మెల్లగా ప్రశ్నించగా, అపుడు జయ పూర్వజన్మవృత్తాంతము చెప్పెను. వెంటనే హరిశ్చంద్రుడు జయను, బిడ్డలను కూడ శివునిదగ్గరకు పంపివేసెను. జయ పూర్వమువలె పార్వతికి చెలికత్తెగా నుండెను. బిడ్డలు శివునికి సేవచేయుచు నుండిరి. ఈ కథవలన, పూర్వవాసనాబలముతో జయ కోర్కెను శివుడు నెరవేర్చుట దోషముకాదని తెలియుచున్నది.

కథ: "ప్రతిష్ఠా సూకరీ విష్ఠా". ప్రతిష్ఠ పందిమలము వంటిదని పెద్దలు చెప్పుచున్నప్పటికిన్ని, ఒకరాజు పేరు ప్రతిష్ఠలకొరకు ఒక దేవాలయమును కట్టించదలచి, ఇతరు లెవ్వరున్ను భాగస్థులుండకూడదనియు, ఉచితముగా

ఇతరులెవ్వరున్ను ఏమియు సహాయము చేయకూడదనియును మంత్రి సామంతాదులతో చెప్పి దేవాలయపుపనిని ప్రారంభింపజేసి కట్టించుచుండెను. చాలాకాలమునకు దేవాలయపు కట్టడము పూర్తియైన తరువాత రాజుగారు వచ్చి చూచి మిక్కిలి సంతోషము నొందినవాడై మంత్రితో 'ఈ దేవాలయపుగోడకు ఎదురుగా అందరకును కనబడునట్లు ఒకరాతిపై నాపేరును సుందరమైన అక్షరములతో చెక్కించి అమర్పింప జేయు'మని చెప్పెను. తరువాత మంత్రి తెలివి గల మేస్త్రీతో చక్కనిరాతిపై రాజుగారి పూర్తి అడ్రసును సుందరమైన అక్షరములతో చెక్కించి దేవాలయపుగోడలో అమర్చెను. మరునాడు రాజుగారు వచ్చి చూడగా రాతి ఫలకముపై తనపేరు లేదు. ఎవరి పేరో గలదు. అపుడు రాజు గారు క్రోధముగలవాడై 'నాపేరును చెక్కించి పెట్టుమని చెప్పి తిని గదా! ఎవరి పేరో చెక్కించితివేమి' యని మంత్రి నడిగెను. మంత్రి గడగడ వణకుచు, 'తమపేరే చెక్కించితి'నని చెప్పెను, తరువాత 'ఈపేరు ఎవరిదో తెలిసికొనిర'మ్మని రాజు మంత్రిని పంపెను. మంత్రి అనేకగృహములకువెళ్లి అనేకమందిని అడుగుచున్నపుడు 'నాపేరుకాదు, నాపేరుకాదు' యని చెప్పుచు వచ్చిరి. చివరకు అడవిలో చిన్నగుడిసె వేసుకొని యుంటున్న ముసలమ్మను ప్రశ్నింపగా 'అది నాపేరే'నని చెప్పినది. అపుడు మంత్రి ముసలమ్మను, రాజుగారివద్దకు తీసికొనిరాగా రాజుగారు, 'ఓ వృద్ధురాలా, మా దేవాలయ మునకు నీవేమైనా సహాయము చేసితివా' యనిప్రశ్నించెను. 'నే నేమియు సహాయముచేయలే'దని ముసలమ్మ సమాధానము చెప్పెను. మరల రాజుగారు 'బాగుగా ఆలోచించి ఏ కొంచె

మైనను సహాయము చేసితివేమో జ్ఞప్తికి తెచ్చుకొని చెప్పు'మని ముసలమ్మను ప్రశ్నించగా, ముసలమ్మ ఆలోచన చేసి యిట్లు చెప్పెను. 'ఒకనాడు దేవాలయ నిర్మాణమునకు గాను రాళ్లతో కూడిన ఎడ్లబండ్లు వచ్చుచున్నపుడు ఎడ్లు ఎండలో లాగలేక, అలసి, నా గుడిసెదగ్గర నిలబడియుండగా కొంచెము పచ్చగడ్డికోసి ఎడ్లకు వేసి నీళ్లుకూడ పెట్టితిని, యింతకంటె నేనేమియు చేయలే'దనెను. అపుడు రాజుగారు 'నా గర్వము నణచుటకుగాను భగవంతుడు నా పేరును తీసివేసి ఆమెపేరును వేసినాడు. కనుక ఈ దేవాలయము నాదికాదు ఆమెదే' యని అందరకును చెప్పి వెళ్ళెను.

ఈ కథవలన, హృదయశుద్ధితో చేయబడినపని కొద్దిదైనను గొప్ప ఫలితము నిచ్చుననియు, మలినహృదయముతో పెద్దపని చేసినను ఫలితము శూన్యమగుననియును తెలియుచున్నది గదా.

కథ : ఒక రాజభవనమునకు ఒక సన్న్యాసి వచ్చి ఆధ్యాత్మికజ్ఞాన ధర్మములను బోధించెను. అందుకు రాజు మిక్కిలి ఆనందములో మునిగినవాడై సన్న్యాసిని గురువుగా నెంచి కోటలోపల ఒక భవనమునందు ఉండవలసినదని ప్రార్థించెను. అందులకు సన్న్యాసి అంగీకరించి నివసించుచు ప్రతిదినమును మోక్షధర్మములను బోధించుచుండెను. వాని బోధనలను శ్రవణము చేయుటకు అనేకమంది ధనవంతులు, ఉద్యోగస్థులు వచ్చి శ్రవణముచేసి వెళ్లునపుడు సన్న్యాసికి పండ్లు, ధనము, వస్త్రములు మొదలగువానిని ఇచ్చి పోవుచుండిరి. అందువలన కొంతకాలమునకు సన్న్యాసి

పరమాత్మచింతనమును బొత్తిగా లేనివాడై ఇంద్రియ విషయ సుఖములకు దాసుడయ్యెను. రాజుగారు గురువుగారి భక్తి, జ్ఞాన, వైరాగ్యాది ధర్మములను తుచ. తప్పకుండ ఆచరించుచుండెను. కొంతకాలమునకు గురువు శిష్యుడున్ను ఒక్కరోజుననే చనిపోయిరి. సన్న్యాసి నరకము నొందెను. రాజు మోక్షసుఖము నొందెను. ఈ కథవలన భావన గొప్పదిగాని క్రియలు, మాటలు, వేషములు, నివాస స్థానములున్ను ప్రధానములు కావని తెలియుచున్నదిగదా!

కథ : ఒక గ్రామములో సన్న్యాసిమఠము కలదు. దానికెదురుగా వేశ్య గృహము కలదు. వేశ్యకు సన్న్యాసి అనేక నీతిధర్మములను బోధించెను. వేశ్యకు వ్యభిచార వృత్తి తప్ప వేరొక జీవనోపాయము లేనందున పశ్చాత్తాపముతో, 'ఓ భగవంతుడా, నాకు అందరున్ను నిందించే వృత్తిని ఎందుకిచ్చితివి' యని సదా సర్వేశ్వరుని స్మరణ చేసికొనుచుండెను. సన్న్యాసి యన్ననో, వేశ్యపై ప్రతిదినమును క్రోధముచూపుచు వేశ్యయింటికి వచ్చిన విటపురుషులను రాళ్లతో లెక్కపెట్టుచు రాళ్లగుట్టను నిర్మించెను. కొంతకాలమునకు ఇరువురును మరణించిరి. సన్న్యాసి నరకము నొందెను. వేశ్య వైకుంఠము జేరికొనెను. ఈ కథవలన భావశుద్ధియే మానవుని ఉద్ధరించునదని తెలియుచున్నదిగదా!

శ్రీ రామకృష్ణపరమహంస చెప్పిన ఒక కథనుకూడ చెప్పెదను. ఇరువురు యువకులు సాయంత్రము షికారుగా బయలుదేరిరి. అందులో నొకడు 'దేవాలయములో జరుగుచున్న పురాణకాలక్షేపము దగ్గరకు వెళ్లుదము రమ్ము'

అనెను. రెండవవాడు 'వేశ్యదగ్గరకు వెళ్ళిన బాగుండు'నని చెప్పెను. చివరకు మొదటివాడు పురాణశ్రవణము జరుగు చోటునకు వచ్చి శ్రవణము చేయుచును సంతోషము నొందజాలక 'వేశ్యదగ్గరకు వెళ్ళిన నా సోదరుడు ఎంత సుఖము నొందుచుండెనో'యని తలంచుచు కూర్చుండెను. రెండవవాడు వేశ్యదగ్గరకు వెళ్ళినను వేశ్యాసంబంధ సుఖము లభించనందున 'నా సోదరుడు పురాణశ్రవణము చేయుచు ఆనందపడుచుండునుగదా! నేను ఏ సుఖమును పొందలేక చెడితినిగదా' యని తలంచుచు కూర్చొని యుండెను. అందువలన పురాణశ్రవణము దగ్గర కూర్చొనిన వానికి వేశ్యాచింతనవలన పాపదోషము గలిగెను. వేశ్య దగ్గరనున్న వానికి పురాణశ్రవణ నివాసచింతనవలన పుణ్యము గలిగెను. ఈ కథకూడ క్రియకంటె భావన ప్రధానమైనదని చెప్పును. శరీరము ఇంటిలోనున్నప్పటికి మనస్సు కాశీరామేశ్వరాది పుణ్యక్షేత్రములందుగాని, మహాత్ముల దగ్గరగాని యున్నచో గొప్పపుణ్యమే గలుగును. శరీరము కాశీరామేశ్వరాది మహాపుణ్యక్షేత్రములందున్నను మనస్సుమాత్రము స్వగృహమునందున్నచో పుణ్యక్షేత్ర నివాస ఫలము లభించదు. అందువలన మనస్సుయున్నచోటనే మనము ఉంటిమనియు, శరీరమున్నచోటనే మనము ఉన్నామనుకొనుట పొరపాటు అగునని గ్రహించవలెను.

"శివమంత్ర జపోధ్యానం హోమో యజ్ఞతపశ్శ్రుతం।
ధ్యాన మధ్యయనం సర్వభావార్థం నాత్రసంశయః॥"
"భావహీనో నర స్సర్వం కృత్వాపి న పి ముచ్యతే।
భావయుక్తః పునస్సర్వం అకృత్వాపి విముచ్యతే॥"

తా. దైవమంత్ర జపము, ధ్యానము, హోమము, యజ్ఞము, తపస్సు, శాస్త్రశ్రవణము, దానము, సద్గ్రంథపఠన మొదలైన పుణ్యకార్యములన్నియును దైవాత్మభావన సిద్ధించుటకొరకే చేయబడుచున్నవి; చేయవలెనుకూడ. దైవభావనలేకుండగా పుణ్యకార్యముల జేసినను మోక్ష సుఖము కలుగదు. దైవభావనతో [చింతనతో] ఎల్లప్పు డున్ను యున్నవారు ఇతర కర్మల జేయకయున్నను ముక్తు లగుదురు. ఈ శ్లోకములుకూడ భావనమునకే శ్రేష్ఠత్వ మిచ్చెనుగదా! ఇప్పుడు క్రియలవలన గల్గు ప్రయోజనము గురించి విచారింతము. లోకములో అనేకులు "ఏమి తింటే నేమి? ఎక్కడుంటేనేమి" యని చెప్పుచు, అజ్ఞానగుణము లతో ప్రవర్తించుచు చెడిపోవుచున్నారు. సద్భావనకల వారు అజ్ఞానగుణములతో ఎన్నడున్ను ప్రవర్తించరు.

ఆహార నియమము, నివాస నియమము, సాంగత్య నియ మము, కర్మ నియమము,మనోనియమము, వచననియమమును అభ్యాసములో నున్నవారు తప్పకపాటించవలెను. ఎందువల్ల ననగా, క్రియలనుబట్టి మనస్సు మారుచుండును. సాధారణ ముగా మంచిపనులను చేయుచున్నచో మనస్సుకూడ మంచిగానే యుండును. ఇట్లే చెడుపనులలోనికి శరీర మును పోనిచ్చినచో మనస్సుకూడ చెడుగానే మారు చుండును. అనన్య దైవాత్మ చింతనగలవారు, ప్రజ్ఞావంతులు, వివేకబుద్ధిబలముగలవారు, మానసాదీంద్రియములను అదు పులో నుంచుకొనిన మహాపుణ్యాత్ములు మాత్రము

నేత్రములకు చెడురూపములు కనబడినను, చెవులకు నిందాది కఠిన శబ్దములు భయంకర ధ్వనులును వినబడినను, జిహ్వకు అరుచి పదార్థములు ప్రాప్తించినను, ముక్కునకు చెడువాసనలు వేసినను, దేహమునకు [చర్మమునకు] శీతోష్ణ మృదుకఠినాది తాకుడులు కలిగినను ఏకాగ్రచిత్తముతోనే, నిర్వికారము గానే దైవాత్మభావముతోనే ఆనందముగా నుండగల్గుదురు.

కనుక సామాన్య సాధకులు శరీరమును, ఇంద్రియము లను చెడుక్రియలలోనికి పోనీయక మంచిపనులనే చేయుచు భావమును [మనస్సును] మంచిగా నుంచుకొనుటకు సదా ప్రయత్నించుచుండవలెను. కామ కాంచనములకును, కీర్తి ప్రతిష్ఠలకును లోబడక సర్వమును భగవన్మయముగా గాంచువారు మాత్రమే అన్నిచోట్ల నిర్భయముగా నుండ గల్గుదురు. పూజ, భజన, స్మరణ, సేవ, దానము, నమస్కా రము మొదలైన పుణ్యకార్యములు చేయుచున్నను, చేయక యున్నను నిష్కామముతో కూడిన దైవాత్మచింతనయే జీవితములో లెక్కలోనికి వచ్చునను విషయమును మరువ రాదు. ఈవిషయమును సంసారులు, సన్న్యాసులు, బ్రహ్మ చార్లు, స్త్రీలును గుర్తులో నుంచుకొని మెలగవలెను.

మొట్టమొదట మంచిక్రియలనే సదా చేయుచు మనస్సును మంచిగా మార్పుచేసికొనవలెను. క్రియకంటే భావనయే గొప్పదని చెప్పుచు చెడిపోయిన వాచా వేదాంతులు అనేకమంది కనబడుచున్నారు. సాధకులు మహాత్ములు చేసిన అమానుషకృత్యములు చేయుటకు ప్రయత్నించరాదు. మహాత్ములు చెప్పిన జ్ఞానధర్మముల

ప్రకారము నడుచుటకు ప్రయత్నించుచుండవలెను. సద్భావనతో సుఖపడలేనివారు సత్కర్మలతోనే సంతోషమొందుచుండవలెను.

కథ : ఒకడు అన్నగారు మరణించవలెనను కోరికతో విశేషముగా భగవంతుని భజించుచుండెను. దీనిని విష్ణు దూతలు చూచి విష్ణువు దగ్గరకుపోయి "భగవానుడా, ఎడతెగకుండ తమనామమును భజించుచుండే పరమభక్తుని మేము చూచితి" మని చెప్పిరి. అపుడు విష్ణువు అతడు నిజమైన భక్తుడు కాదనియు, అన్న చనిపోవలెనని, అన్నగారి ఆస్తి తనకుమారునికి చెందవలెననియును పెద్ద కోరిక హృదయములో నుంచుకొని భజనచేయుచున్నాడనియు త్వరలో అతడు నరకము నొందబోవుచున్నాడనియు జెప్పెను.

ఈ కథవలన చెడ్డకోరికలు నెరవేరవలెనను కోరికలతో పూజ, భజన, నమస్కారములు, జపధ్యానములు, సేవలున్ను చేయుచుండుట మహాపాపమనియు, నరకదుఃఖ ప్రాప్తికి కారణములగు ననియును తెలియుచున్నదిగదా!

శ్లో. నదేవో విద్యతేకాష్ఠే నపాషాణే నమృణ్మయే
భావేతు విద్యతేదేవః తస్మాద్భావోహికారణమ్ ॥

తా. దేవుడు కొయ్యయందు లేడు. రాతియందు లేడు. మట్టియందు, కాగితమునందును లేడు. భావమునందే దేవుడు కలడు. అందువలన భావమే ప్రధానమైనదని గ్రహించి సర్వమును దైవముగానే భావించవలెను. జగము కూడ

భావములోనే కలదుగదా! సుఖ మనుకొనుట, దుఃఖ మనుకొనుట, మిత్రు లనుకొనుట, శత్రువులనుకొనుట, నావా రనుకొనుట, నీవా రనుకొనుట, బంగార మనుకొనుట, మన్ననుకొనుట, పుట్టినారనుకొనుట, చచ్చినా రనుకొనుట మొదలైనవన్నియు భావములే యగును. భావాతీతులకు జగమే లేదు.

శ్లో. అణ్వప్యుపాహృతం భక్త్యా ప్రేమ్ణాభూర్యేన మేభవేత్
భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయకల్పతే ॥

తా. "కొంచెమైనను భక్తితో (ప్రేమతో) ఒసంగ బడినది కొండంత కాగలదు. కొండంత ఇచ్చినను భక్తితో కూడియుండనిచో అది నాకు సంతుష్టిని కలిగించదు" అని భగవంతుడు చెప్పెను.

## మౌనము మంచిదా, మాట్లాడుట మంచిదా?

శ్లో. జిహ్వాగ్రే వర్తతే లక్ష్మీః, జిహ్వాగ్రే మిత్రబాంధవాః
జిహ్వాగ్రే బంధనప్రాప్తిః, జిహ్వాగ్రే మరణం ధ్రువమ్ ॥

తా. మాటలవలననే సంపదలు లభించును. మాటల చేతనే లోకమున బంధుమిత్రాదు లేర్పడుచున్నారు. మాటలవలననే బంధనములు కలుగుచున్నవి. మాటల వలననే మరణమున్ను కలుగుచున్నది.

సత్యముగా, ధర్మముగా, మితముగా, మృదువుగా, ఇతరులకు మేలుకలుగునట్లుగా మాట్లాడుట, మానవధర్మ మగును. అసత్యముగా, అధర్మముగా, కఠినముగా, కీడు కలుగునట్లుగా మాట్లాడుట రాక్షస స్వభావమగును.

మౌనముగా నుండుటలో మంచి కలదు, చెడును కలదు. ఇట్లే, మాట్లాడుటలో మంచి కలదు. చెడునుకలదు.

"మౌనేన కలహం నాస్తి."

మౌనముగా నున్నవారికి కలహము లుండవు.

కథ : ముగ్గురు విమానముపై వెళ్లుచున్నారు. అప్పుడే గరుడపక్షి పామును తీసికొని ఆకాశమున ఎగురుచుండెను. దీనిని విమానములోనున్న ముగ్గురును చూచిరి. అందులో ఒకడు, "సెభాష్, దుష్టజంతువుని గరుడపక్షి చంపి లోకమునకు ఉపకారము చేయుచున్నది" అని పలుకగానే అతడు నరకమునకు వెళ్ళెను.

రెండవవాడు "అయ్యో! బలముగల జంతువు బలహీనముగల జంతువును అన్యాయముగా చంపెనుగదా!" అని కరుణారసహృదయముతో పలుకగానే అతడు స్వర్గమునకు వెళ్ళెను.

మూడవవాడు ఈశ్వరసంకల్ప ప్రకారము సృష్టిలో క్రియలు సహజముగా జరుగుచుండుననుకొని మౌనముగా నుండుటచే మోక్షము నొందెను.

ఈ కథవలన మౌనమే గొప్పదని తెలియుచున్నది గదా!

కథ : భీముని కొడుకు ఘటోత్కచుడు. ఇతని కొడుకు బర్బరీకుడు. ఇతడు పూర్వజన్మమున సూర్యవర్చుడు అను పేరుగల యక్షుడు. కృష్ణావతారము రాకపూర్వము బ్రహ్మాది దేవతలు శ్రీమన్నారాయణుని దగ్గరకు వచ్చి దుష్టులతో గూడిన భూభారమును తగ్గించవలసినదిగా మొర

పెట్టుకొనుచుండగా అహంకారముతో సూర్యవర్చుడు అందుకొని "భూభారమును నేనే తగ్గించెద"నని బలమద గర్వముతో పలుకగా బ్రహ్మదేవునికి కోపమువచ్చి, "ఓ యక్షా, పృథ్వీభారమును దూరముచేయువేళ, శ్రీకృష్ణ భగవానుడు నిన్ను రణరంగమునకు బలిచేయునుగాక" అని శపించెను. అందువలన యక్షుడు బర్బరీకుడుగా పుట్టి పెరిగెను. యుద్ధరంగమున అర్జునుడు గర్వముతో "ఒకే ఒకరోజున కౌరవసైన్యములను సర్వనాశనము చేయగల" ననెను. బర్బరీకుడు "క్షణములోనే శత్రువుల నందరిని యమపురికి పంపెద"నని అహంకారముతో పలికెను. దేవతల వలనను, మహర్షులవలనను వరముల నొందినవారలు అనేకు లుండగా అర్జునుడు, బర్బరీకుడును పలికిన పలుకులు ధర్మవిరుద్ధములైనవి, అసత్యములు నగునని శ్రీకృష్ణ భగవానుడు నిశ్చయించుకొని బర్బరీకుని శిరమును చక్రముతో నరికివేసెను.

"అనువుగానిచోట నధికుల మనరాదు
కొంచెమైన నదియు కొదువగాదు
కొండ యద్దమందు కొంచెమై తోచదా
విశ్వదాభిరామ వినురవేమ."

పై జెప్పబడిన అర్జునుడును, బర్బరీకుడును మౌనముగా నుండక గర్వముతో మాట్లాడుటవలన బర్బరీకుడు వెంటనే చంపబడెను. అర్జునుడు స్వర్గారోహణచేయునపుడు పతనము జెందెనుగదా!

కథ: ఒక బ్రాహ్మణుడు ఒక మహాత్మునకు భోజనము పెట్టదలచి గొల్లమ్మను పెరుగు తీసికొని రావలసినదని చెప్పగా ఆమె పెరుగుపాత్రను తట్టలో పెట్టుకొని, తట్టను శిరమున నుంచుకొని వచ్చుచుండెను. గాలికి పెరుగుపాత్రపైగల వస్త్రము ప్రక్కకు తొలగెను. గరుడపక్షి పామును పట్టుకొని ఆకాశమున కెగిరి పోవుచుండగా పామువిషము పెరుగుపాత్రలో పడినది. ఈవిషయము గొల్లతల్లికి తెలియదు. పెరుగును తీసికొనివెళ్లి బ్రాహ్మణున కివ్వగా అతడు మహాత్మునికి వడ్డించెను. మహాత్ముడు భోజనము చేయగానే మరణించెను. అపుడు అనేకులు అచటకు చేరి మహాత్ముడు మరణించుటకు కారణము లెవ్వి? ఈదోషము భోజనము పెట్టిన యజమానునిదా, పెరుగు తెచ్చిన గొల్లభామదా అని విచారించుచుండగా ఒకడు వచ్చి "యజమానుడు విచారణ చేయకుండ మహాత్మునకు భోజనము పెట్టెను గాన భోజనము పెట్టినవానికే ఈ పాపదోషము జెందు"ననెను. అప్పుడు మారువేషముతో యమధర్మరాజు వచ్చి "నేను అన్నములో విషము కలిపి తీసికొని వచ్చెదను, నీవు గుర్తించి చూపెదవా" యని సిద్ధాంతము చేసినవాని నడిగెను. అపుడతడు "చూపలే"ననెను. యముడు వెంటనే "దోషమును నిర్ణయించి చెప్పినవాడే దోషమును అనుభవించవలె" నని చెప్పి అతనిని యమలోకమునకు తీసికొనిపోయెను.

ఈ కథవలన నిజము తెలియనప్పుడు మౌనముగా నుండుటయే మంచిదని తెలియుచున్నదిగదా!

కథ : అర్జునస్వామి యను బ్రాహ్మణుని భార్యను ఎవరో తీసికొనిపోయిరి. అందువలన అతడు భార్యను వెదకుచు అనేక గ్రామములు తిరుగుచుండెను. ఒకనాడు ఒక బ్రాహ్మణుని ఇంటికి వెళ్లి 'ఈ పూట భోజనము, పెట్ట వలసిన'దని కోరగా వారు 'పెట్టెద'మని చెప్పిరి. వంటకాగానే బ్రాహ్మణునిభార్య అర్జునస్వామిని భోజనమునకు పిలిపించెను. ఆయన వచ్చి 'అమ్మా, నేను స్నానము, సంధ్యావందనమును చేయలేదు. విస్తరాకులో అన్నమును పెట్టి యిచ్చిన-చో మూట కట్టుకొని నది ఒడ్డునకు వెళ్లి స్నాన, సంధ్యలు పూర్తిచేసు కొనెద'నని చెప్పెను. అందుకు ఆమె సమ్మతించి అన్నమును విస్తరాకులో పెట్టి యిచ్చెను. అర్జునస్వామి దానిని మూట కట్టుకొని నదీతీరమునకు పోయి స్నానముచేసి సంధ్యా వందనము ముగించి అన్నపుమూటను విప్పియుంచి త్రాగుటకు నీళ్లను తెచ్చుకొనుటకు వెళ్లి వచ్చులోపల ఒక గరుడపక్షి పామును పట్టుకొని వచ్చి చెట్టుపై కూర్చొని తినుచుండగా పాముయొక్క విషపుచుక్కలు క్రిందగల అన్నములో పడినవి. దీనిని అర్జునస్వామి గుర్తించక భుజించెను. వెంటనే అతడు మరణించెను. ఈ దోషము భోజనము పెట్టినవారికి కలుగునా, గరుడపక్షికా, పామునకా యని విక్రమార్క మహారాజును భేతాళుడడుగగా, ఫలానివారికని నిర్ణయించిన వానికే దోషము కలుగునని చెప్పెను.

ఈ కథవలన మౌనము గొప్పదని తెలియుచున్నది.

"స్నానేచ భోజనే హోమే జపే
మౌన ముపాశ్రయేత్."

తా. స్నానము చేయునపుడు, భోజనము చేయునపుడు, పూజ, యజ్ఞము, జపమును చేయుచుండునపుడును మౌనముగా నుండవలెను.

శ్లో. మౌనేన భోజయిత్వాతు, స్వర్గం ప్రాప్తో న సంశయః
సజల్పమ్ భుంజతేయస్తు, తేనాన్న మశుచిర్భవేత్
పాపంస కేవలం భుంక్తే, తస్మాన్మౌనం సమాచరేత్
ఉపవాస సమం భోజ్యం, జ్ఞేయం మౌనేన నారద.

తా. మౌనముగా నుండి పరమాత్మచింతనతో భుజించుచుండువారు నిస్సంశయముగా స్వర్గము నొందుదురు. మాట్లాడుచు భుజించుచున్నచో అన్నము మలినదోషము గలది యగును. మాట్లాడుచు భుజింపబడుచున్న అన్నము అన్నము కాదు. పాపమే యనబడును. అందువలన మౌనముతో భగవచ్చింతనతోను భోజనము చేయుచుండవలెను. ఓ నారదా, మౌనముగానుండి భుజించుట ఉపవాసమున్న పుణ్యఫలముతో సమమగును.

ఆ. మాట లుడుగకున్న మంత్రంబు దొరకదు
మంత్ర ముడుగకున్న మనసు నిలదు
మనసు నిలువకున్న మహి ముక్తిలేదయా
విశ్వదాభిరామ వినుర వేమ.

## మాటలలో మంచిచెడ్డలు

శ్లో. యుక్తి యుక్త ముపాదేయం, వచనం బాలకాదపి
అన్యతృణ మివత్యాజ్య, మప్యుక్తం పద్మ జన్మనా.

తా. శాస్త్రధర్మయుక్తముగా పలికిన మాటలను బాలుడు పలికినను అంగీకరించవలెను. శాస్త్ర విరుద్ధముగా పలికిన పలుకులు బ్రహ్మదేవునివైనను గడ్డిపరకనువలె త్యజించవలెను.

పరాపవాదం పరిహార జిహ్వే
పారుష్యంచానృత మపి మా వద
సంకీర్తయ కేశవ, నారాయణ, వామన,
గోవింద, హరే, శ్రీకృష్ణ, హృషీకేశ,
మురాంతక, వరద, జనార్దన, శౌరే
వైకుంఠాధిప, లక్ష్మీనాయక,
బుధజన మానస మందిరేతి సతతమ్

తా. ఓ నాలుకా, ఇతరులను వ్యర్థముగా నిందించుట మానుకొనుము. కఠినముగా మాట్లాడకుము. అబద్ధము లాడకుము. ప్రతిదినమును 'కేశవా, నారాయణా, వామన, గోవింద, హరే, శ్రీకృష్ణ, హృషీకేశ, మురాంతక, వరద, జనార్దన, శౌరే, వైకుంఠాధిప, లక్ష్మీనాయక, బుధజనమానస మందిర యని కీర్తన చేయుము. (జమదగ్ని)

"కాకి ఎవరి సొమ్ము కాజేసింది
కోకిల ఎవరికి కిరీటకం పెట్టింది
నోరుమంచిదైతే ఊరంతామంచిదే"
అని కబీరుదాసు అనెను.

ఆ. నేరనన్నవాడు నెరజాణ మహిలోన
నేర్తునన్నవాడు నిందజెందు
ఊరకున్నవాడె యుత్తమ యోగిరా
విశ్వదాభిరామ వినుర వేమ.

తా. తెలియదని చెప్పువారే మంచి తెలివిగలవారు. తెలిసినవాడనని చెప్పువాడు నిందపొందును. ఏమియు తెలియదని యూరకున్నవాడే ఉత్తముడు.

ఆ. అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు జల్లగాను
కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా
విశ్వదాభిరామ వినుర వేమ.

కథ : రావణాసురుని భార్యలలో మండోదరి మహా పతివ్రత యనబడును. ఈమె రావణాసురునికి అనేక నీతి ధర్మములను బోధించినప్పటికి రావణాసురుడు వినక, విపరీత చర్యలను మానక అనేక బాధలను, నిందలను తెచ్చుకొనుచు చివరకు సీతను గురించి శ్రీరామచంద్రునితో యుద్ధమును ప్రారంభించి చేయుచు తనసైన్యమంతయు నశించిన తరువాత రావణుడే మిగిలెను. రావణుడు మండోదరి దగ్గరకు వెళ్ళి, "నన్ను రామునితో యుద్ధము చేయమనెదవా పారిపొమ్మనెదవా ?" యని ప్రశ్నించెను. అందులకు ఆమె "సమయము మించిపోయినది గాన మీ యిష్ట మెట్లున్నదో అట్లే చేసికొనుడు" అని సమాధానము చెప్పెను. యుద్ధముచేయుమని చెప్పినచో భర్త మరణించుటకు

ఇష్టపడినట్లు యగును. పారిపొమ్మని చెప్పినయెడల భర్తకు పిరికితనమును బోధించినట్లు యగును. కాన, మండోదరి నిర్ణయము చేయలేదు.

కథ : ధర్మరాజును దుర్యోధనుడు జూదమాడుటకు పిలిపించినపుడు, ధర్మరాజు విదురుని దగ్గరకు వెళ్ళి "జూద మాడుట తప్పుపనులలో నొకటి గదా! నన్ను జూద మాడుటకు వెళ్లమనెదవా, వద్దనెదవా, చెప్పు" మని అడుగగా, "నీవే ఆలోచించుకొని నీ బుద్ధికి తోచినట్లు చేయు"మని విదురుడు చెప్పెను. చివరకు ధర్మరాజు జూదమాడి సర్వమును ఓడిపోయి, అనేక బాధలు తెచ్చుకొనెనుగదా!

పై చరిత్రలవలన ఒక్కొక్క చోట ఇతరులతో సంబంధము గలుగకుండునట్లు మాట్లాడుట మంచిది యని తెలియుచున్నదిగదా !

శ్లో. నాఽపృష్టః కస్యచి ద్బ్రూయాత్
న చాఽన్యాయేన పృచ్ఛతః
జానన్నపి చ మేధావీ
జడవ ల్లోక ఆచరేత్. (మనువు)

తా. అడుగనిదే ఎవరికిని, దేనిని చెప్పకూడదు. అన్యాయముగా ప్రశ్నించినను జవాబు చెప్పకూడదు (అనగా, దేవుడున్నాడా, పుణ్య పాపము లున్నవా? స్వర్గ నరకములున్నవా యను వితండ ప్రశ్నలకు సమాధాన మివ్వరాదు.) బుద్ధిమంతులైనవారు అన్నీ తెలిసికొని యుండియు తెలియనివారివలె లోకములో ప్రవర్తించవలెను.

శ్లో. అపృష్టోపి హితం బ్రూయాత్
యస్య నేచ్ఛేత్ పరాభవం
ఏష ఏవ సతాం ధర్మో
విపరీత మతోఽన్యథా. (హితోపదేశము)

తా. నీవు ఎవరికి కష్టనష్టములు, అపకీర్తియు కలుగ కూడదని కోరెదవో వారికి, అడుగకపోయినను మంచిని చెప్పవలెను. ఇది సజ్జనులు చేయదగినది. అడుగలేదుగదా యని క్షేమముగలుగు మాటలు చెప్పకుండుట మంచిది కాదు.

ధర్మరాజు సోదరులు అరణ్యములో, విషపునీరు త్రాగి చనిపోయినపుడు, యక్షునితో ధర్మము చెప్పుటవలన సోదరులు బ్రతికిరి. వరముల నొందెను.

ధర్మరాజు యుద్ధములో అసత్యము చెప్పుటవలన స్వర్గారోహణ చేయునపుడు నరకమును చూచెను.

పై కథలవలన మంచిమాటకు మంచియు, చెడ్డ మాటకు చెడ్డయు గలుగునని తెలియుచున్నదిగదా!

## సంయమవ్రతము

సంజ్ఞచే తెలుపుటకు సాధ్యపడకపోయినచో మాత్రమే మాట్లాడవలయును. అదియు పదివాక్కులతో చెప్పవలసిన దానిని ఒక్కవాక్కుతో సారమును గ్రహించి చెప్పుటయు, మాట్లాడుటకు ముందుగా అర్థమును ఊహించుటయు, ఆ వాక్కు నెవరు వినవలసియుందురో వారికన్న దూరముగా శబ్దము పోకుండ చూచుటయును సంయమవ్రతమగును. వీరికి మనశ్శక్తియు, బుద్ధివికాసమును కలుగును.

వాక్కుయొక్క నియమము ఒకటి గల్గినచో తక్కిన సర్వేంద్రియములయొక్క నిగ్రహము త్వరలో సిద్ధించును. ఇంద్రియనిగ్రహము మోక్షద్వారము తెరచును. (ఇది శ్రీ మళయాళ సద్గురువు చెప్పిన సందేశము.)

మాటలచేత దేవతలు మన్ననచేసి వరంబు లిత్తురు
మాటలచేత భూపతులు మన్ననచేసి పురంబు లిత్తురు
మాటలు నేర్వకున్న అవమానము, న్యూనము,
మానభంగమున్.

మనవలన ఇతరులు క్షేమము పొందవలసిన అవసరమున్నపుడు సత్యధర్మములు తప్పక మాట్లాడవలెను. ఇతరులకు ఆపదలువచ్చు మాటలు మాట్లాడుటకంటె మౌనము మంచిది.

తల్లిదండ్రులదగ్గర, గురువుదగ్గర, పెద్దలదగ్గర, రోగులదగ్గర మౌనవ్రతముతో నుండరాదు.

శరీరమును, వాక్కును, మనస్సును దోషములులేని మార్గమున నడిపించుమని దేవుని ప్రతిదినమును ప్రార్థించుచుండవలెను.

అధికముగా మాట్లాడుటలో అనేకదోషములు కలుగును. అధికముగా వాగుచుండువారిని చూచి జనులు, పెద్దలు, బాలురును హేళన చేయుదురు. తేలికగా మాట్లాడుదురు. అగౌరవించెదరు.

వాక్కులోనే పుణ్యము కలదు, పాపము కలదు. కీర్తి కలదు. అపకీర్తి కలదు. మరణము కలదు. మోక్షము కలదు. దైవదర్శనము కలదు.

వాక్కుతో నారదుడు, ద్రౌపది, అంబరీషుడు, త్యాగరాజు, రామదాసు, సక్కుబాయి, మీరాబాయి మొదలగు భక్తులెందరో భగవంతుని కీర్తించి దైవ సాక్షాత్కారము నొందిరి.

కొందరు కీర్తి కొరకు మౌనముగా నుందురు. కొందరు కలహములు వచ్చునేమో యను భయముచే మౌనముగా నుందురు. కొందరు వేదాంత శాస్త్ర ధర్మములను మననము, విచారణ చేయుటకు, జపధ్యానములు చేసికొనుటకు అనుకూలముగా నుండునని మౌనవ్రతముల జేయుచుందురు.

## జిహ్వా సంబోధనము

### బిల్వమంగళుడు

1. శ్రీకృష్ణ రాధావర గోకులేశ
గోపాల గోవర్ధన నాథ విష్ణో
జిహ్వే పిబ స్వామృత మే తదేవ
గోవింద దామోదర మాధవేతి.

ఓ నాలుకా! నీవు శ్రీకృష్ణా, రాధారమణా, గోకులేశా, గోపాలా, గోవర్ధనా, నాథా, విష్ణూ, గోవిందా, దామోదరా, మాధవా యని ఉచ్చరింపుము. అట్టి భగవన్నామామృతమును పానము చేయుము.

2. శ్రీనాథ విశ్వేశ్వర విశ్వమూర్తే
శ్రీ దేవకీనందన దైత్యశత్రో
జిహ్వే పిబ స్వామృతమేత దేవ
గోవింద దామోదర మాధవేతి.

ఓ నాలుకా! నీవు శ్రీనాథా విశ్వేశ్వరా, విశ్వమూర్తీ, దేవకీనందనా, దైత్యశత్రూ, గోవిందా, దామోదరా, మాధవా యని ఉచ్చరింపుము. అట్టి భగవన్నామామృతమును పానముచేయుము.

3. గోపీపతే కంసరిపో ముకుంద
లక్ష్మీపతే కేశవ వాసుదేవ
జిహ్వే పిబ స్వామృత మేతదేవ
గోవింద దామోదర మాధవేతి.

ఓ నాలుకా! నీవు గోపీనాథా, కంసారీ, ముకుందా, లక్ష్మీపతీ, కేశవా, వాసుదేవా, గోవిందా, దామోదరా, మాధవా యని ఉచ్చరింపుము. అట్టి భగవన్నామామృతమును పానము చేయుము.

4. గోపీజనాహ్లాదకర వ్రజేశ
గోచారణారణ్యాకృత ప్రవేశ
జిహ్వే పిబ స్వామృత మేతదేవ
గోవింద దామోదర మాధవేతి.

ఓ నాలుకా! నీవు గోపీజనాహ్లాదకరా, వ్రజేశా, గోపికలకు ఆనందమును గలుగజేయువాడా, గోవులను మేపుటకు అరణ్యమును ప్రవేశించినవాడా, వ్రజరాజా, గోవిందా, దామోదరా, మాధవా యని ఉచ్చరింపుము. అట్టి భగవన్నామామృతమును పానము చేయుము.

5. ప్రాణేశ విశ్వంభర కైటభారే
వైకుంఠ నారాయణ చక్రపాణే
జిహ్వే పిబ స్వామృత మేతదేవ
గోవింద దామోదర మాధవేతి.

ఓ నాలుకా! నీవు ప్రాణేశ్వరా, విశ్వంభరా, కైటభారీ, వైకుంఠా, నారాయణా, చక్రపాణీ, గోవిందా, దామోదరా, మాధవా అని ఉచ్చరింపుము. అట్టి భగవన్నామామృతమును పానము చేయుము.

6. హరే మురారే మధుసూదనాద్య
శ్రీరామ సీతావర రావణారే
జిహ్వే పిబ స్వామృత మేతదేవ
గోవింద దామోదర మాధవేతి.

ఓ నాలుకా! నీవు హరీ, మురారీ, మధుసూదనా, శ్రీరామా, సీతాపతీ, రావణారీ, గోవిందా, దామోదరా, మాధవా అని ఉచ్చరింపుము. అట్టి భగవన్నామామృతమును పానము చేయుము.

7. శ్రీ యాదవేంద్రాద్రి ధరాంబుజాక్ష
గోగోప గోపీ సుఖదానదక్ష
జిహ్వే పిబ స్వామృత మేతదేవ
గోవింద దామోదర మాధవేతి.

ఓ నాలుకా! నీవు శ్రీ యాదవేంద్రా, గిరిధరా, అంబుజాక్షా, గోగోపగోపీసుఖ పదా, గోవిందా, దామోదరా, మాధవా అని ఉచ్చరింపుము. అట్టి భగవన్నామామృతమును నిరంతరము పానము చేయుము.

## నవ్వు - ఏడుపు

ఒకరకమైన నవ్వువలన ఇతరులకు ఆనందము గలుగును. తనకు పుణ్యము గలుగును.

ఇంకొకరకమైన నవ్వువలన ఇతరులకు క్రోధము గలుగును. తనకు పాపము గలుగును.

ఇతరులు కష్టనష్టముల పాలైనపుడు, అపకీర్తిపాలైనపుడును నవ్విన యెడల మనకు పాపము వచ్చును. ఇతరులకు క్రోధము గలుగును.

ఇతరులకు సుఖములు, లాభములు, సత్కీర్తియు గలిగినపుడు సంతోషించుచున్న యెడల మనకు పుణ్యము గలుగును.

ఇతరులు చేయుచున్న పుణ్యకర్మలకు సంతోషించుచున్న యెడల మనకుకూడ పుణ్యములో కొంత భాగము లభించును.

ఇతరులు మనస్సుతో, మాటలతో, శరీరముతోను చేయుచున్న పాపకర్మలకు మనము సంతోషించుచున్న యెడల వారి పాపములో కొంతభాగము మనము పంచుకొందుము.

మనము చేయు పుణ్యముగాని, పాపముగాని ఇతరులు చూచి సంతోషించినయెడల మన పుణ్యపాపములలో కొంత భాగము ఇతరులకు సంక్రమించును. అందువలననే చేసిన పుణ్యమును ఇతరులకు తెలియనీయరాదనియు, చేసిన పాపమును ఇతరులకు చెప్పి పశ్చాత్తాపపడవలెననియును పెద్దలు చెప్పుచున్నారు.

మనము మహాత్ములను, పుణ్యాత్ములను, సద్గుణవంతులను, సత్కర్మలను, సద్ధర్మములను, దేవుని ప్రభావములను చూచుచున్నను, స్తుతించుచున్నను, స్మరించుచున్నను, ధ్యానించుచున్నను మహాపుణ్యము కలుగును.

కథ : జనకమహారాజుగారి సభలో మంత్రులు, రాజులు, ఋషులున్ను కలరు. ఎనిమిది వంకరలు గల అష్టావక్రమహాఋషి అచటకు రాగానే ఋషులు చూచి నవ్విరి. అపుడు ఋషులను చూచి అష్టావక్రుడు కూడ నవ్వెను. 'నీవెందుకు నవ్వితి' వని ఋషు లడిగిరి. 'మీ రెందుకు నన్ను చూచి నవ్వితిరో ముందు చెప్పు'డని అష్టావక్రు డడిగెను. 'ఎనిమిది వంకరలుగల మీ శరీరమును చూచి నవ్వితి' మని ఋషులు చెప్పిరి. అపుడు అష్టావక్ర మహర్షి 'మీరు ఋషు లను పేరుగలవారయ్యును నాలో గల సచ్చిదానందస్వరూప పరబ్రహ్మమును చూడక, శవ సదృశమగు శరీరమును చూచుచున్నందుకు నవ్వితి' ననెను. అపుడు ఋషులు తమ అజ్ఞానదృష్టిని తలంచుకొని సిగు జెందిరి. అష్టావక్రమహర్షిని పొగడిరి.

కథ : లక్ష్మణుడు శ్రీరామునితో అరణ్యవాసము చేయుచు నిద్రాహారములు లేక పదునాలుగు సంవత్సరము లున్నను శ్రీరామపట్టాభిషేక సమయమున నిద్రవచ్చుటచే లక్ష్మణుడే నవ్వుకొనెను. ఇతరులు లక్ష్మణస్వామి నవ్వును చూచి, అనేకులు అనేకవిధములుగా దోషారోపణ జేసి కొనుచు చెప్పుకొనిరి.

కథ : కురూపులైన ఋషులను చూచి ఒక గంధర్వుడు నవ్వగా 'నీవు సర్పమగుదువుగాక' యని ఋషులు శపించిరి. ఆ సర్పమే యశోద భర్తయగు నందుని కాలు పట్టుకొనెను. వెంటనే శ్రీకృష్ణుడు వచ్చి పామును తన్ని విడిపించి శాపవిమోచన గలిగించెను.

కథ : భీష్మాచార్యులవారు మరణకాలము వచ్చే ముందు అంపశయ్యపై పరుండియుండి ఋషులకును, రాజులకును మహాధర్మములను బోధించుచుండగా ద్రౌపదీదేవి వచ్చి చూచి అదేపనిగా నవ్వుచుండెను. అది చూచి భీష్ముడు, 'అమ్మా ద్రౌపదీ, ఎందుకు నవ్వుచున్నావు ?' అని అడిగెను. అపుడు ద్రౌపది 'ఆనాడు నిండుసభలో దుశ్శాసనుడు నా చీరలను లాగుచున్నపుడు మీరేవిధమైన ధర్మములను చెప్పక ఈనాడు మరణముముందు మహాధర్మములను బోధించుట చూచి నవ్వుచున్నా' ననెను. అపుడు భీష్మాచార్యులు, 'అమ్మా, నీవు చెప్పినమాట నిజమే. కాని, నాస్థితిని నీవు గమనించలేదు. ఆనాడు దుర్యోధనుడు పెట్టిన పాపపు ఆహారముచే గలిగిన రక్తము నా శరీరములో నుండుటవలన ధర్మసందేశములు నాహృదయమునుండి పుట్టలేదు. ఇప్పుడు

అర్జునుని బాణములు నా శరీరమునకు తగిలి పాపపు రక్తము కారిపోయినది. అందువలన ఈనాడు పరిశుద్ధరక్తము మిగిలి యున్న హృదయమునుండి సద్ధర్మములు వెలువడుచున్నవి' యని చెప్పెను.

కథ : ఒకప్పుడు దుర్వాసమహర్షి బ్రహ్మదేవుని సభకు వచ్చి అపస్వరములతో బ్రహ్మదేవుని స్తుతించుట సరస్వతీదేవి విని నవ్వెను. అందులకు దుర్వాసుడు క్రోధముతో 'నీవు భూలోకమందు పుట్టుదువుగాక' యని శపించెను. అపుడు సరస్వతి కాశీక్షేత్రమందు ఉభయ భారతిగను, బ్రహ్మ మండనమిశ్రుడుగను అవతరించిరి.

కథ : ఒకరాజుగారి కోటలోనికి ఒక సన్న్యాసి రాగా, రాజుగారు సన్న్యాసిని మిక్కిలి గౌరవించి ఆయననే గురువుగా నెంచుకొని, కోటలో నొక భవనమునందు నివాస మేర్పాటు చేయించెను. గురువుగారు చేయుచున్న ధర్మబోధల ప్రకారము రాజుగారు అనుష్ఠించుచు క్రమముగా భక్తి జ్ఞాన వైరాగ్యములలో ఆరితేరెను. గురువుగారు రాజుగారి బంధుమిత్రాదులు ఇచ్చు ధనమునకు, ఆహారములకు, వారు చేయు నమస్కారములకు, స్తుతికి, సేవలకును లోబడి యోగ మును వదలి భోగి యయ్యెను. త్యాగమును వదలి రాగి యయ్యెను. ఆస్తికత్వమును వదలి నాస్తికుడయ్యెను. ఆత్మ దృష్టిని మరచి దేహదృష్టిగలవాడయ్యెను. అభేద దృష్టిని వదలి భేదదృష్టిగలవాడయ్యెను. శాంతమును వదలి క్రోధి యయ్యెను. కొంతకాలమైనతరువాత రాజు, సన్న్యాసి ఇరువురు నొక రోజుననే చనిపోయి రాజు ఊర్ధ్వలోకమునకు

వెళ్ళెను. గురువగు సన్న్యాసి అధోలోకమునకు వెళ్ళెను. ఈ దృశ్యమును నగరమునకు వెలుపల వనములో శిష్యులకు ఆధ్యాత్మిక జ్ఞానధర్మములను ప్రబోధించుచున్న యతీశ్వరుడు చూచి పకపక నవ్వెను. అపుడు శిష్యులు తమ గురు భగవానులు ఈనాడు ఎన్నడులేని నవ్వును నవ్వుచున్నారే యని యాశ్చర్యమును పొందినవారై, 'గురుదేవా, తమరు బోధించు సమయమున తమ రేకారణమువలన నవ్విరిరో తెలియజేయ వలసిన'దనికోరగా, 'గురువుగారు ఈనగరములో గల కోటలో రాజుగారు, సన్న్యాసియు గలరను విషయము మీకు తెలిసియే యున్నదిగదా! ఆ గురు శిష్యు లిరువురు నిపుడు చనిపోయి గురువు అధోలోకమునకు పోవుచుండెను. శిష్యుడు ఊర్ధ్వ లోకమునకు వెళ్లుచుండెను. అందువలన నాకు పట్టరాని నవ్వు వచ్చెను. ఈ కథవలన వైరాగ్యములేని సన్న్యాసికంటె నిజమెరిగి వైరాగ్యముతోనున్న గృహస్థుడే గొప్పవాడు అను విషయము బోధపడినదిగదా!' అని చెప్పెను.

శ్లో. చక్షుర్భ్యాం హసతే విద్వాన్, దంతోష్టభ్యాస్తు మధ్యమః
అధతు చాట్టహాసేన, నా హసంతి మునీశ్వరాః ॥

తా. నేత్రములతో విద్వాంసులు నవ్వెదరు. దంతములతో, దవడలతో మధ్యరకమువారు నవ్వుదురు. అథములు బిగ్గరగా, అట్టహాసముతో నవ్వుదురు. మునీశ్వరులు నవ్వరు.

## ఏడుపు

కథ : మయూరధ్వజుడను రాజుయొక్క ప్రభావమును అర్జునునకు శ్రీకృష్ణభగవానుడు చూప దలచి ఒకనాడు

శ్రీకృష్ణార్జునులు బ్రాహ్మణవేషముల ధరించి మయూరధ్వజుని వద్దకు వెళ్ళి తాము మహా ఆపదలో నున్నామని పలువిధములుగా బొంకి 'నీయొక్క శిరస్సులోని కుడిభాగమును నీభార్యా, కొడుకులచేత రంపముతో కోయించి ఇవ్వవలసినదని కోరగా 'అట్లే ఇచ్చెద'నని మయూరధ్వజమహారాజు చెప్పి కోయుటకు భార్యను, కుమారుని నియమించి శిరస్సును కోయించుకొను చుండగా ఎడమనేత్రమునుండి నీళ్లు కారుచుండెను. ఆ నీటిని బ్రాహ్మణులగు కృష్ణార్జునులు చూచి 'ఓ రాజా, నీవు భక్తితో (సంతోషముతో) నివ్వక ఏడ్చుచు నిచ్చుచున్నావు. కనుక మాకు అవసరము లేదు. మేము తీసికొనము' అనిరి. అపుడు పరమభక్తుడగు మయూరధ్వజుడు, 'మహాత్ములారా, నా శిరస్సును నా భార్య, నా కొడుకును రంపముతో కోయునపుడు బాధతో ఎడమకంటినుండి నీళ్లు కార్చుట లేదు. కుడిభాగము మహానుభావులకు అర్పింపబడి ఎడమభాగము కూడ మహాత్ములకు అర్పింపబడక వ్యర్థమగుచున్నదిగదా యను దిగులుతో, దుఃఖముతో ఎడమనేత్రము నుండి నీళ్లుకార్చితి'నని చెప్పగా, శ్రీకృష్ణార్జునులు మయూరధ్వజమహారాజుయొక్క భక్తికి, త్యాగమునకు మిక్కిలి మెచ్చుకొని తమ నిజస్వరూపమును చూపి, నిన్ను పరీక్షించుటకొరకే మేము వచ్చితిమని చెప్పి రాజుగారి శరీరమును స్వస్థతపరచి వెళ్ళిపోయిరి.

కథ : ఒకమునికి భార్య, కొడుకు, శిష్యుడున్ను గలరు. ప్రతిదినమును మునీశ్వరుడు భార్యకు శిష్యునకును భగవద్గీతాది వేదాంతశాస్త్రధర్మములను బోధించు

చుండును. కొంతకాలమునకు ఒకనాడు భార్య ఏడ్చుచు వచ్చి 'మన కుమారుడు చనిపోయె'నని చెప్పి విశేషముగా నేడ్చెను. అపుడు మునీశ్వరుడును ఏడ్చెను. అపుడే శిష్యుడుకూడ నేడ్చెను. ముని శిష్యుని చూచి 'శిష్యా, నీవెందు కేడ్చితివో చెప్పుము' అనెను. 'గురుదేవా, తమ రెందు కేడ్చితిరో ముందుగా సెలవియ్యవలసినదని కోరుచున్నాను తరువాత నావిషయము చెప్పెద'నని శిష్యు డనెను. అపుడు ముని 'నేను ప్రతిదినమును ఆత్మ నిత్యమైనదనియు, దేహధనాదులు అనిత్యములైనవగుటచే అవిపోయినచో దుఃఖపడకూడదనియు, ఉన్న శరీరాదులయందు ఆసక్తి నుంచకూడదనియును బోధించుచున్నను ఈమె కుమారుడు పోయినందుకు ఏడ్చుచున్నదే! నే నింతవరకు బోధించిన బోధ వ్యర్థమయ్యెను గదా యనుకొని దుఃఖపడితి' ననెను. అపుడు శిష్యుడు 'మనగురువుగారు ఆత్మ నిత్యమైనదని, దేహ మనిత్యమైనదనియు చెప్పుచున్నారుగదా! కుమారుడు చనిపోయినాడని అమ్మగారు చెప్పగానే దుఃఖపడినారే! మనకు వైరాగ్యము లేని గురువు, ఆత్మానుభూతి స్థిరముగాలేని గురువు, వాచావేదాంతియగు గురువు దొరికినారే యనుకొని దుఃఖపడితి' ననెను. అపుడు గురువగు ముని శిష్యుని ఆవేదనకు సంతసించెను.

కథ: రెడ్డిరాజవంశములో పుట్టిన వేమనయోగి విరాగియై రోడ్డుప్రక్కన దుమ్ములో దిగంబరియై కూర్చొనియుండగా అన్నగారు మేనామీద వెళ్లుచు తమ్ముని చూచి మేనా దిగివచ్చి దుఃఖపడెను. అన్నను

చూచి తమ్ముడగు వేమన్నకూడ దుఃఖపడెను. "నీవెందు కేడ్చితి"వని అన్నగా రడిగిరి. "నీవెందు కేడ్చుచున్నావో చెప్పుము" అని తమ్ము డడిగెను. "అష్టభోగములతో గూడిన రాజభవనమును త్యజించి దరిద్రునివలెను, పిచ్చివానివలెను బిచ్చమెత్తుకొని మనతమ్ముడు తిరుగుచున్నాడుగదా, యని దుఃఖపడితి"నని అన్నగారు చెప్పెను. "మన అన్న శాశ్వతమైన పరమాత్మ సుఖమును కోరక క్షణికములు, అశాశ్వతములునైన ఇంద్రియవిషయ భోగములకు దాసుడై చెడిపోవుచున్నాడుగదా యనుకొని దుఃఖపడితి"నని తమ్ముడగు వేమనయోగి చెప్పెను.

దేవుని నిమిత్తము (మోక్ష సుఖప్రాప్తి నిమిత్తము) ఏడ్చుట సాత్విక పిచ్చియగును.

ఇంద్రియవిషయ భోగములప్రాప్తి నిమిత్తము ఏడ్చుట రాజసిక పిచ్చి యగును.

శారీరక బాధల నిమిత్తము ఏడ్చుట తామసిక పిచ్చి యగును.

కథ : ఒకచోట ఒకపండితుడు భగవద్గీతోపన్యాసములిచ్చుచుండెను. అచటికి వచ్చి వినుచున్నవారలలో ఒక పురుషుడు, ఒకవితంతుస్త్రీయును కంట నీరు పెట్టుకొని దుఃఖపడుచుండుట పండితుడు చూచి "మీరెందుకు దుఃఖపడుచుండిరి?" అని అడిగెను. అందుకు పురుషుడు "శ్రీకృష్ణ భగవానుడు రథముముందు కూర్చొని వెనుకకు శిరమును త్రిప్పి అర్జునునకు బోధించుచుండునపుడు ఆ భగవానుని మెడ ఎంత బాధపడుచున్నదో యని దుఃఖపడుచున్నా" ననెను.

ఇక విత౦తు స్త్రీ చెప్పినదేమనగా "నాభర్త చనిపోయి కొన్నిమాసములుమాత్రమే యైనది. మీరు చదువుచున్న భగవద్గీతయొక్క బైండుగుడ్డ త్రాడును చూచుచుండగా నా ప్రియమైన భర్తయొక్క మొలత్రాడు ఇట్టి రంగు గలదేగదా యని భర్తను గుర్తునకు తెచ్చుకొని కన్నీళ్లు విడుచుచున్నా" ననెను.

ఈ కథవలన హృదయమును గుర్తించుట కష్టమని తెలియవలెను.

## ఆలస్యం మంచిదా, తొందర మంచిదా?

శ్లో. రాగే ద్వేషే చ మానే చ, ద్రోహే పాపే చ కర్మణి
అప్రియే చైవ కర్తవ్యే, చిరకారీ ప్రశస్యతే ॥

తా. 1. ప్రేమించుట 2. ద్వేషించుట 3. గౌరవించుట 4. ద్రోహముచేయుట 5. ఏదేని పాపకర్మ చేయుట, 6. అప్రియము గావించుట—వీనిలో ఆలస్యము చేయువారు కీర్తి నొందెదరు.

విచారణ (ఆలోచన) చేసి పనులను, మాటలను ప్రారంభించు వారలలో ఆలస్యము గలదు.

తొందరపడి పనులను, మాటలను ప్రారంభించు వారలలో ఆలోచన (దూరదృష్టి) వుండదు.

ఆలోచనలేకుండ భావోద్రేకమునకు వశులై పనులను ప్రారంభించినను, మాటలు మాట్లాడినను కలహములు, పాపదోషములు, అపకీర్తియు గలుగవచ్చును. కాన ముందు వెనుక బాగుగా ఆలోచించుట మంచిది.

ఇప్పుడుగాని, భవిష్యత్తులోగాని పాపము, అపకీర్తి, దుఃఖమును కలుగకుండునట్లు పనులజేయువారు, మాట్లాడు వారున్ను ఉత్తములనబడుదురు.

జీవితంలో కొన్ని పనులలో ఆలస్యము మంచి దగును. కొన్ని సమయములలో (పనులలో) తొందర మంచి దగును.

శ్లో. సహసా విదధీతనక్రియా

మవివేకః పరమాపదామ్॥ (భారవి)

తా. ఏపనినైనను ఆలోచన చేయకుండ, తొందరపడి చేయకూడదు. అవివేకము అన్నివిధములైన ఆపదలకును మూలమైనది.

## తొందరచే చెడినవారి కథలు

(1) రాగము (ప్రేమ): రావణాసురుడు దూరాలోచన చేయక తొందరపడి మారువేషముతో వచ్చి సీతను తీసికొనిపోవుటవలన చెడిపోయెను.

ఇట్లే, చంద్రుడు దేవతలకు గురువగు బృహస్పతి భార్యను పొందుటవలన శాశ్వత అపకీర్తి, మచ్చయు నొందెనుగదా!

ఇట్లే, కీచకుడు దూరాలోచనచేయక ద్రౌపదిని కోరుటచే భీమునిచే మరణించెను గదా! ఇట్లే, సైంధవుడును, కౌరవులున్ను అనాలోచనకృత్యములు చేసి చెడిపోయిరి.

(2) శ్రీకృష్ణునందు ద్వేషమును ఉంచుకొనిన కంసుడు, శిశుపాలుడు, దుర్యోధనాదులున్ను మరణించిరి.

(3) గౌరవించుటలో తొందరపడి జమదగ్ని కార్త వీర్యార్జునునివలన మరణించెను.

వశిష్ఠుడు విశ్వామిత్రునివలన బాధలుపడెను. జమదగ్నిమహర్షికి, వశిష్ఠునకును కామధేనువులు గలవు. వీని ఆధారముతో ఆలోచనచేయకుండ గౌరవించుటవలన ఆపదలు వచ్చినవి.

బ్రాహ్మణవేషముతో జటాసురుడు వచ్చియున్నప్పుడు పాండవులు ఆలోచించకుండ గౌరవించుచుండుటవలన కొంత కాలమునకు జటాసురుని దుర్గుణమువలన శ్రమపడవలసి వచ్చినదిగదా! అదేదనగా, లోమశుడు, ధౌమ్యుడు, భీముడును లేని సమయమున ముగ్గురు పాండవులను, ద్రౌపదిని జటాసురుడు మోసికొని పోవుచుండెను. తరువాత భీమునకు తెలియుటవలన వచ్చి అసురుని చంపివేసెను.

(4) ద్రోహము : వాలి సుగ్రీవునికి ద్రోహము చేయుటవలన రామునివలన మరణించెను.

దుర్వాసుడు అంబరీషునికి ద్రోహముచేయుటవలన శ్రీహరి చక్రముచే త్రిలోకములకును పరుగు లిడి, శ్రమపడి అంబరీషుని శరణు పొందెను.

(5) పాపముచేయుముందు ఆలోచన లేకపోవుట వలన, నహుషుడు ఋషులచేత పల్లకీని మోయించుకొని తొందరగా నడువుడని తన్నుటచేత ఋషుల శాపము నొంది అజగరమై స్వర్గమునుండి భూలోకమున పడెను.

దశరథుడు మునికుమారుని చంపుటచే శాపమునొంది శ్రీరామునిపై గల విశేషమోహముచే మరణించెను.

(6) బొట్టుపెట్టునపుడు అరుంధతీదేవికి సీత అప్రియ మును గలిగించుటవలన శాపము నొందెను.

ద్రౌపదికి దుశ్శాసనుడు అప్రియమును గలిగించుట వలన భీముని చేతిలో మరణించెను.

శ్రీరాముని గుహుడు 'ఓరీ రామా' యని అని నపుడు తొందరపడి లక్ష్మణుడు గుహుని చంపబోయెను.

భరతుడు అడవిలోనున్న శ్రీరాముని దగ్గరకు వచ్చుచున్నపుడు 'మనలను చంపుటకే భరతుడు వచ్చు చున్నా'డని లక్ష్మణుడు తలంచి, 'భరతుని చంపెద'నని రామునితో చెప్పెను.

హనుమంతుడు సుగ్రీవుడు పంపగా మొదట రామ లక్ష్మణుల దగ్గరకు వచ్చుచున్నప్పుడు, 'ఎవడో రాక్షసుడు మనలను చంపుటకు వచ్చుచున్నా'డని లక్ష్మణుడు తలంచి బాణముతో ఆంజనేయుని కొట్ట దలంచెను.

విభీషణుడు అన్నయగు రావణాసురుని త్యజించి సముద్రమును దాటివచ్చి శ్రీరాముని శరణు బొందుటకు దగ్గరకు చేరబోవగా రాక్షసు డెవడో వచ్చుచున్నాడని లక్ష్మణుడు తలంచి బాణముతో కొట్టుటకు ప్రయత్నించెను.

లక్ష్మణుడు గుహుని, భరతుని, హనుమంతుని, విభీషణుని చంప ప్రయత్నించినపుడు శ్రీరాముడు నివారింప జేసెను.

విచారణ లేనివాడు లక్ష్మణుడు. నిదానముగా విచారించి వర్తించువాడు రాముడు.

రాముడు పరమాత్మస్వరూపుడు. లక్ష్మణుడు జీవ స్వరూపుడు.

పరమాత్మకు నిజము తెలియునేగాని, జీవునికి నిజము తెలియదు. పరమాత్మ గుణరహితుడు. జీవుడు త్రిగుణములు గలవాడు.

తెలిసినవారు అంతరాత్మను విచారించి పనులను చేయుచుందురేగాని, తొందరపడి చేయరాని కృత్యముల లోనికి దిగరు.

కథ : బాగుగా చదువుకొని బుద్ధిమంతుడై యున్న భార్గవిని జనులందరున్ను పొగడుచుండగా అతని తండ్రి తన కుమారునకు కీడుగలుగునేమో యని తలంచి కొడుకుపై దోషారోపణలు చేయుచు చెప్పుచుండెను. అందువలన కుమారునకు కోపమువచ్చి తండ్రిని చంపదలచినవాడై ఒకనాటిరాత్రి తల్లిదండ్రులు ఇంటిలో పరుండుటకు ముందే పెద్దరాతిని తీసికొని అటకపై కూర్చొనెను. రాత్రి తల్లి దండ్రులు పరుండిరి. తరువాత తల్లి తండ్రితో "మనకుమారుని మీరు ఇతరుల దగ్గర నిందించుచుంటిరట. అందుకు వాడు మిక్కిలి బాధపడుచున్నాడు. నిందాప్రసంగములు మీ రెందుకు చేసిరి?" అనెను. అందుకు తండ్రి తల్లితో, 'ఓ పిచ్చిదానా, మన అబ్బాయిపై నాకు ప్రేమలేక పలుకు చున్నాననుకొను చున్నావా! ఇతరులు మనకుమారుని విద్యా బుద్ధులకు మిక్కిలి సంతోషించి నాదగ్గర పొగడుచున్నారు. అపుడు నేను మనకుమారునకు దిష్టిదెబ్బ తగిలి కీడు గలుగునేమో యను సందేహముతో మనకుమారునిపై

దోషారోపణలుచేసి పలికితి ”నని చెప్పెను. ఈమాటలను అటకపై కూర్చొనియున్న కుమారుడు విని, “ఆహా! నా తండ్రి నా క్షేమమునే కోరుచున్నా”డని తలంచి క్రిందికి దిగివచ్చి తండ్రిపాదములపై బడి తాను చేయదలచిన దుష్కృత్యమును చెప్పి పశ్చాత్తాపపడి తండ్రిని క్షమించవలసినదని వేడుకొనెను. అప్పటినుండి కుమారుడు ఏపనినైనను తొందరపడక నిదానముగా విచారించి చేయుటయే మంచిదని నిశ్చయించుకొనెను.

కథ : శ్రీరాముడు సేతువును నిర్మించినపుడు సహాయము చేసిన ఉడుతయొక్క పూర్వజన్మచరిత్రలోకూడ భారవి చరిత్రలోని అంశములు గలవు. తండ్రిని కొట్టుట వలన అరణ్యములో పులివి కమ్మని శపించెను. తరువాత ఉడుతవు కమ్మని శపించెను. శ్రీరాముని కరస్పర్శచే శాప విమోచన మగునని చెప్పెను.

కథ : శ్రీరాముడు ప్రతిదినమును మరీచిమహర్షిని పూజించెడివాడు. అందులకు మహర్షి సంతోషించి ఒకనాడు శ్రీరామచంద్రుని శిరమునకు తులసీమాలను సమర్పించెను. అందులకు శ్రీరాముడు క్రోధముతో దూరాలోచన చేయక “ ఓహో! ఒక చెట్టుయొక్క ఆకులను నా తలమీద వేసితివే ? బ్రాహ్మణుల యాశీర్వాదము నొందుట ధర్మమని మీ అవజ్ఞను, గర్వమునకు ఓర్చితి ” ననెను.

అప్పుడే తులసి రోషముతో, “ఓ రాజేంద్రా, మదగర్వమున ఋషి మెడలో వేసిన మంజరీ పుంజములతో గూడిన

మాలను తీసి పారవేసితివి. కావున నీకు సీతావియోగము కలుగునుగాక” యని శాప మిచ్చెను.

తరువాత మరీచిమహర్షి తులసీ ప్రభావమును గురించి బోధించగా శ్రీరాముడు ఇంటికి వెళ్లి ప్రతిదినమును తులసిని పూజచేయుచుండెను. అందుచే రావణాది రాక్షసులను నిర్మూలించే శక్తి గలిగెను.

## ఆలస్యము చేయరాదు : “ఆలస్యమమృతం విషమ్”

ఒక్కొక్క సమయములో ఆలస్యము చేసినచో పాపము గలుగును. ఆపదలు వచ్చును. కష్ట నష్టములున్ను కలుగును.

కథ : కర్ణుడు తల నంటుకొనునపుడు శ్రీకృష్ణ భగవానుడు వెళ్లి నూనెతో గూడియున్న బంగారపుగిన్నె నిమ్మని కోరగా ఎడమచేతివైపున నున్న గిన్నెను కుడిచేతికి మార్చి యిచ్చుటలో ఆలస్యమగుననియు, బుద్ధి మారిపోవు నేమో యనియు సంశయించి, ఎడమచేతితోనే దానము చేసెను.

కథ : ధర్మరాజు దగ్గరకు ఒకనాడొక యాచకుడు రాగా, “రేపు రమ్ము” అని ధర్మరాజు చెప్పెను. అపుడు భీముడు “అన్నా, రేపు రమ్మని చెప్పెదవేల! ఈ శరీరముగాని, నేడుగల బుద్ధి రేపు గాని నిలుచునో నిలువదో! కనుక ఇప్పుడే, ఆలస్యముచేయక యిమ్ము” అని చెప్పెను.

కథ : భద్రాచల రామదాసుగారిని, భార్యను తీసికొని వెళ్లుటకుగాను వైకుంఠమునుండి విమానము వచ్చినది.

అపుడు భార్య ఆలస్యము చేసినందున రామదాసుని మాత్రమే తీసికొని వెళ్లినది. తరువాత రామదాసుభార్య దుఃఖపడుచుండగా రాముడు ప్రత్యక్షమై "రెండు మాసములు తులసీపూజ చేయుము. తరువాత నిన్ను వైకుంఠమునకు తీసికొని వెళ్ళెద" నని చెప్పెను.

కథ : తుకారాముని, భార్యను తీసికొని వెళ్ళుటకు వైకుంఠమునుండి విమానము రాగా తుకారాముడు విమానముపై కూర్చొనుటకు వెళ్ళుచు భార్యను కూడ తొందరగా రమ్మని చెప్పగా "దయచేసి తమరు వెళ్ళండి. ఈ సంసారమును వదలి నే నెక్కడికి రాగలను" అని సమాధానము చెప్పినది.

మలమూత్రములను విడువవలసిన అవసరము వచ్చి నపుడు ఆలస్యము చేయకూడదని వైద్యశాస్త్రము చెప్పెను.

ఆలస్యము చేసినచో అమృతముకూడ విష మగును.

కథ : ఒకప్పుడు ఇరువురు స్త్రీలు గంగానదిలో స్నానముచేయుచు మునిగిపోయిరి. అపుడు వెంటనే ఇరువురు యువకులు వచ్చి నీటిలో మునిగిన స్త్రీలను బైటకు తీసికొని వచ్చిరి. అందులో నొకడు "నేను నిన్ను ప్రాణము పోకుండ రక్షించితిని. కనుక నన్ను పెండ్లి చేసికొనుము" అనెను. "రెండవవాడు ఆపత్కాలములో రక్షించుట జీవిత ధర్మ"మని చెప్పి ఫలాపేక్షారహితుడై యుండెను.

కనుక, లోకములో కొన్ని పనులను ఆలస్యముగా విచారించి చేసిన మాత్రమే క్షేమము గలుగు ననియు,

కొన్నిసమయములలో ఆలస్యము చేసినచో కష్టనష్టములు కలుగు ననియు గ్రహించుకొని వర్తించవలెను.

కథ : ఒక ఊరిలో పుత్రమిత్రాదులతో గూడిన దరిద్రుడు ప్రతిదినమును బాధపడుచు, ఒక సాధుపుంగని దగ్గరకు వెళ్ళి "దరిద్రబాధ నివారణమగు ఉపాయమును సెలవియ్య వలసిన"దని మిక్కిలి దీనవదనముతో వేడుకొనెను. అపుడా సాధుమహాత్ముడు ఆదరిద్రునికి ఒక స్పర్శవేది నిచ్చి, "దీనిని ఇనుమునకు తాకించినచో బంగార మగును. కాన, ఒక సంవత్సరమువరకు నీవు వాడుకొనుచు నుండుము. తరువాత నేను వచ్చి నా స్పర్శవేదిని తీసికొని వెళ్ళెద"నని చెప్పెను. అపుడా పేరాశగల తెలివితక్కువ దరిద్రుడు తనఇంటిలోగల ఇనుపముక్కలకు స్పర్శవేది నంటించి బంగారముగా చేసికొని తొందరగా దరిద్రబాధను తగ్గించు కొనక ఇనుపదుకాణమునకు వెళ్ళి విశేషముగా ఇనుమును కొని స్పర్శవేదితో విశేషముగా బంగారమును సమకూర్చుకొని ఒక్కసారే గొప్ప ధనవంతుడు కావలెనని పేరాశ పెట్టుకొని ఇనుప దుకాణదారుని దగ్గరకు పోయి అడుగగా "ఇపుడు ఇనుము వెల చాల పెరిగియున్నది. ఆరుమాసములకు వెల తగ్గవచ్చును. కాన ఆరు నెలలైన తరువాత రావలసిన"దని ఇనుప వర్తకుడు చెప్పెను. వెంటనే దరిద్రుడు ఇంటికి పోయి ఆరుమాసములైన తరువాత మరల ఇనుప దుకాణదారుని దగ్గరకు వచ్చి అడుగగా "ఇనుము ధర తగ్గలేదు. మరొక ఆరుమాసములైన తరువాత రావలసిన"దని వర్తకుడు చెప్పగా ఆ దరిద్రుడు ఇంటికి వెళ్లి ఆరు నెలలైన తరువాత

వర్తకుని దగ్గరకు వెళ్లుటకు ప్రయాణ మగుచుండగా సాధుపుంగవుడు వచ్చి తన స్పర్శవేదిని అడిగి తీసికొని వెళ్లిపోయెను.

అపుడా దరిద్రుడు సంవత్సరము ఆలస్యముచేసి స్పర్శవేది వలన లాభము నొందకపోతినిగదా యని ఎంతో విలపించెను.

ఈ కథవలన ఆలస్యము వలన గలిగిన అనర్థకము తెలిసినదిగదా!

## కర్మఫలమును అనుభవింపక తప్పదు

ప్రశ్న: పాపకర్మ దోషముల వలన బాధలు పొందిన దెవరు? పుణ్యకర్మల ప్రభావమువలన సుఖముల నొందిన దెవరు?

సమా: దేవతలు, ఋషులు, రాజులు, భక్తులు, మృగములు, పశువులు, పక్షులున్ను పుణ్యపాపకర్మల ఫలితములవలన సుఖదుఃఖముల నొందిరి, పొందుచున్నారు.

ప్రశ్న: దేవుడైన విష్ణువు రామావతార మెత్తుటకు కారణములెవ్వి?

సమా: దేవశర్మ, భృగుమహర్షి, బృంద, సనత్కుమారుడు, నారదుడును శాపము లిచ్చుటవలన భార్యావియోగముచే బాధకలిగించునట్టి రామావతారము సంభవించెను. అరుంధతీదేవి సీతకు శాప మిచ్చుటవలన రాముడు వివేకహీను డయ్యెను.

ప్రశ్న : రాముడు శ్రీకృష్ణుడుగా పుట్టి కిరాతకునిచే చంపబడుటకు కారణమేమి ?

సమా : రామావతారమందు ఋషుల కిచ్చిన వరము వలన కృష్ణావతార మెత్తెను. వాలిని చంపిన దోషము వలన శ్రీకృష్ణుడు ( ఐదుసంవత్సరముల వయస్సులో శకటాసురుని చంపి, ఆరవయేట గోపీవస్త్రాపహారణ చేసి, ఏడవయేట గోవర్ధనగిరి నెత్తి, పండ్రెండవయేట కంసుని చంపి, ఏబదిఏడవయేట రాజసూయయాగముచేసి, డెబ్బదవ సంవత్సరము భారతయుద్ధమందు అర్జునునకు రథసారథిగా నుండి ) 125 సంవత్సరముల 7 మాసముల 8 రోజుల వయస్సున కిరాతకుడుగా పుట్టి వచ్చిన వాలిచే అవతారమును చాలించెను. ( ఇదివరలో దుర్వాసుడు ఇచ్చిన శాపము ప్రకారము శ్రీకృష్ణుని అరికాలునకు కిరాతకుని బాణము తగులుటవలన శరీరమును వదలెను. )

మనము మనోవాక్కాయములతో మంచిపనులను చేయుచున్నయెడల దేవతలు, ఋషులు, మహాత్ములు, భక్తులు, సామాన్యమానవులు, పంచమహాభూతములు, పశుపక్ష్యాదిమృగములున్ను శుభము నొందునట్లు మనలను ఆశీర్వదింతురు. చెడుపనులు జేసినచో అశుభము నొందునట్లు శపింతురు.

ప్రశ్న : హరిశ్చంద్రుడు, చంద్రమతి, లోహితాసుడును అనేక బాధలుపడుటకు కారణములెవ్వి ?

సమా : హరిశ్చంద్రుడు పూర్వజన్మమున నీలలోహితుడు అనెడి పేరుగల రాజు. ఇతడు కాపుస్త్రీని వుంచుకొని

ఆ స్త్రీయొక్క భర్తను, మామను, మొదలగువారిని అనేక విధములుగా బాధించె (హింసించె) ను. చివరికి వారందరు నదిలోపడి చనిపోయిరి.

కాపుస్త్రీ యగు కలకంధర తననిమిత్తము కుటుంబము వారందరు చనిపోయిరిగదా యని దుఃఖించి, మహాపాపము చేసితినని నిశ్చయించుకొని పాపపరిహారముకొరకు ఇరువది యొక్క సంవత్సరములు కేదారేశ్వరవ్రతము చేసెను.

చివరకు నీలలోహితుడు, కలకంధర చనిపోయి నీలలోహితుడు త్రిశంకుడను రాజునకు కుమారుడుగా పుట్టెను. కలకంధర జ్యోతిష్మంతుడను రాజునకు కుమార్తెగా పుట్టెను.

కొంతకాలమైన తరువాత హరిశ్చంద్రుడు, చంద్రమతి యను పేరులతో దంపతులైరి. విశ్వామిత్రునివలన పూర్వజన్మమందు చేసిన పాపదోషముల వలన అనేక బాధలు పడిరి.

లోహితాసుడు పూర్వజన్మమున కుబేరుని పుత్రుడగు నలకూబరుడు (గంధర్వుడు). ఒకప్పుడు తక్షకుడను పాము బిడ్డను వెంటబెట్టుకొని ఇంద్రలోకమునకు పోవుచుండగా బాలుడు వినోదదృశ్యముల జూచుచు వెనుకబడెను. ఈ పిల్లవానిని రంభ దగ్గరకు వెళ్లుచున్న నలకూబరుడు చూచి నాగుబాము ఎదురు వచ్చుట మంచిదికాదని వాని తలను నరికెను. ఈవిషయమును నారదుడు ఇంద్రలోకమునకు వెళ్లి చెప్పగా తక్షకుడు వచ్చి సంజీవినితో బ్రతికించి నలకూబరునితో "నా పగ దీర్చుకొందు" నని చెప్పి మరుజన్మమున

లోహితాసుని కరచి చంపెను. ఎవరి కర్మ వారినే వెంబడించునుగదా!

కథ : ఒకప్పుడు ఇంద్రుడు, సూర్యుడును మారు వేషములతో అహల్య దగ్గఱకు వచ్చి ఆమెను మోసగించి ఆమెతో భోగించిరి. అందువలన ఆమెకు వాలి, సుగ్రీవులున్ను పుట్టిరి. ఈవిషయమును అహల్యాభర్తయగు గౌతమ మహర్షి తెలిసికొని అహల్యపై క్రోధము చూపి "పాషాణము (శిల) కమ్మ"ని శపించెను. అపుడు అహల్య "ఓ బుద్ధిలేని మునీ" యని గౌతముని శపించెను. అహల్య పాషాణమయ్యెను. గౌతముడు పిచ్చివాడయ్యెను. శ్రీరాముని వలన అహల్య వేలసంవత్సరములు గడచిన తరువాత శాపవిముక్తి నొందెను. గౌతముడు చిదంబరక్షేత్రమందు చాలాకాలము తపస్సుచేసి పిచ్చినుండి విడుదల నొందెను.

ఈ కథవలన బాగుగా ఆలోచించక చేసిన పనుల యొక్క ఫలితములు తెలియుచున్నవిగదా!

కథ : పాండురాజు వేటకు వెళ్లి లేళ్ళదంపతులు రమించుకాలమున బాణముతో కొట్టెను. అపు డవి "నీవు రతికాలమున మరణించెదవుగాక"యని శపించెను. అందువలన పాండురాజు రెండవ భార్యయగు మాద్రితో రమించునపుడు మరణించెను.

కథ : కేకయరాజు వేటకు వెళ్లి లేళ్ళదంపతులలో మగలేడిని బాణముతో కొట్టి చంపెను. అందువలన ఆడలేడి యొక్క తల్లి మందరగా పుట్టి కేకయరాజుయొక్క అల్లుడగు దశరథమహారాజు మరణించునట్లు చేసెను. "నా అల్లుని

చంపితివి గాన నీ అల్లుణ్ణి నేను చంపించెద” నని కక్షతో, పట్టుదల వహించిన లేడియొక్క సాహసమును సామాన్య మైనదికాదుగదా!

కథ : ఒకరాజు సింహాసనముపై కూర్చొని యుండగా, పులి తరుముచుండగా ఒక లేడి రాజును రక్షించవలసినదని చెంతకు వచ్చెను. అపుడా రాజు ఇది దేనికి వచ్చినదో విచారణచేయని మందబుద్ధిగలవాడై దానిని చంపివేసెను. ఆ దోషము వలన కొంతకాలమునకు ఇతరరాజు వచ్చి రాజ్యమును ఆక్రమించి స్వాధీనము చేసికొని రాజ్యభ్రష్టుని చేసెను.

ఒకడు పెద్దలకు ఒకవస్తువును యిచ్చెదనని వాగ్దానము చేసియు ఇవ్వనందున మరుజన్మమున నక్కగా పుట్టెను.

ఇంకొకడు పెద్దలు భుజించుటకు దాచియుంచబడిన ఫలహారములను దొంగతనముగా తీసికొని భుజించుటవలన కోతిగా పుట్టెను.

ఒకడు తన భార్యపై క్రోధము నుంచుకొని నేత్రములను పోగొట్టుటవలన మరుజన్మమున పుట్టుగ్రుడ్డివా డయ్యెను.

## భోజరాజు పూర్వోత్తర జన్మలు

“దాన అదోషేణ భవేద్దరిద్రః” జీవుడు దానము చేయని దోషముచే దరిద్రుడై జన్మించును.

భోజరాజునకు ఒక ఋషి పూర్వజన్మ వివరాలు చెప్పి పుణ్య పాప ఫలితాలు ఎలా వుంటాయో, దుష్కృతం

ఎలా పీడిస్తుందో, సుకృతం ఎంతగా లాభిస్తుందో వివరించాడు. భోజుడు అంతకు ముందుజన్మలో దరిద్రుల కుటుంబంలో పుట్టాడు. అతని తల్లిదండ్రులకు ఇద్దరు మగబిడ్డలు, ఒక ఆడపిల్ల. తండ్రిపోయి వీరంతా దిక్కు-మాలినవారయి తల్లి సంరక్షణలో పెరిగారు.

ఒకసారి వారి కుటుంబములో మూడురోజులుగా ఎవరూ ఏమీ తినలేదు. వారితల్లి బయట ఎన్నోవీధులు తిరిగి అందర్నీ యాచించి కొంత పిండిని సంపాదించి చపాతీలు (రొట్టెలు) చేస్తే ఇంట్లోని వారందరికి తలో చపాతీమాత్రం వచ్చింది. వారందరు అలా పంచుకొన్నప్పుడు ఒక సాధువు "ఆకలిగావుంది, ఏమైనా పెట్టు"మని వచ్చాడు. మేమంతా మూడురోజులు పస్తున్నాం నాయనా, వేరే ఎక్కడైనా చూచుకో అని చెప్పవచ్చునుగదా! అలా అనలేదు. తల్లి లేదని చెప్పింది. సాధువు కదలలేదు. ఆమెకు కోపంవచ్చి, "మాకే లేక చస్తుంటే కదలవేమి"టని అతని చొక్కా-పట్టి లాగితే అది చిరిగి ఊడి వచ్చింది. ఆమె కూతురు చెత్త తెచ్చి వానిపైన గుమ్మరించింది. చిన్నకొడుకు వేడిగావున్న యినుపఊచ తెచ్చి అంటించాడు. ఇన్ని చేసినా అతడు కదలలేదు. పాపం చాలా ఆకలిగా వుండివుంటాడు అనుకొని పెద్దవాడు మాత్రం తన చపాతీలో సగం అతనికి తినమని ఇచ్చాడు.

ఇలా మనస్సుకు తోచినట్లు చేసినవారందరికి తరువాత జన్మలో ఎన్నోరకాల ఫలితాలు మారినాయి. అందులో దైవభక్తుడైన సాధువు మానవుడు అవటంవల్ల మంచి చెడు

ఫలితాలు చాలా ఎక్కువ అయ్యాయి. అతని చోక్కా-
చింపిన పాపానికి తల్లి మరుజన్మలో పిచ్చిదయి అడవులలో
దిగంబరిగా తిరుగుతుంది. సాధువుపై చెత్త కుమ్మరించి
నందుకు కుమార్తె మరుజన్మలో వీధులు తుడిచే పనిమనిషి
అయింది. వేడి ఊచ అంటించినందుకు చిన్నబిడ్డ హోమాల
పిచ్చిలోబడి తనశరీరాన్ని సదా వేడిపాలు చేస్తున్నాడు.
పెద్దవాడు మూడు రోజులు పస్తున్నా, తనకు ఆకలి ఎంతగా
వున్నా అవన్నీ సహించి, బయటివాని దుస్థితి గ్రహించి,
తనకున్న చపాతీలో సగం సాధువునకు ఇచ్చినందుకు
భోజరాజుగా పుట్టాడు.

ప్రశ్న: రోగము లెట్లు పుట్టినవి?

ఉత్త: మానవులు మనస్సుతోను, మాటలతోను,
శరీరముతోను పాపములు చేయుచుండుటవలన తొంభై
ఎనిమిది (98) రోగములు పుట్టిన వని గౌతమబుద్ధుడు
చెప్పెను.

మృత్యుదేవత బహ్మదేవుని దగ్గరకు వెళ్ళి "జీవుల
దగ్గరకు వెళ్ళి వారి ప్రాణములను తీసికొన జాలక యున్నాను.
అనేకచోట్లకు తిరుగుట బాధాకరముగా యున్నది. నేను
వెళ్లకుండ జీవులు నాదగ్గరకు వచ్చునట్లు చేయవలసిం''దని
దుఃఖముతో చెప్పుకొనెను.

అపుడు బ్రహ్మదేవుడు ఏడ్చుచున్న మృత్యుదేవత
యొక్క కంటినీళ్లను దోసిటలోనికి గ్రహించి విరజిమ్మగా, ఆ
అశ్రుజలకణంబులు నలుమూలల కోట్లకొలదిగ వ్యాపించినవి.
అవియే మహావ్యాధులుగా మారినవి ( పుట్టినవి ).

దక్షప్రజాపతి చేయుచున్న యజ్ఞమునకు శివుడు ప్రమథగణములతో వెళ్లి యజ్ఞమును రక్తముచే ఆర్పివేయగా అందుండి మృగరూపమై ఆకాశమున కెగసెను. శివుని నుదుట కోపమున చెమటచుక్కపడి పురుషుం డయ్యెను. వాని పేరు జ్వరము.

అప్పుడు శతానందుడు ఈ జ్వరము ఏకముఖత్వమున భూమికి దుర్భరంబగునుగాన బహువిధములుగా సృజింపు మనగా,

(1) కరులకు శిరస్తాపనంబును (2) పాములకు కుబుసంబూడుటయును (3) గోవులకు డెక్కల బాధయును (4) మృగములకు నైజస్వరూపము కనబడకుండుటయును (5) గుఱ్ఱములకు పార్శ్వశోషణంబును (6) నెమళ్లకు రెక్కలూడుటయును (7) కోకిలలకు నేత్రరోగంబును (8) శుకంబులకు ఎక్కిళ్లును (9) మేకలకు చిత్త భ్రమణంబును (10) పులులకు శ్రమయును (11) మనుష్యులకు జననమరణాదులందు భయదుఃఖములును కలుగునట్లుగా జేసెను (భారతము శాంతిపర్వం).

కథ : పూర్వజన్మమున దేవాలయాధిపతిగా నున్న మానవుడు మరణించిన తరువాత కుక్కగా పుట్టి శ్రీరాముని దగ్గరకు వచ్చి చెప్పెను. ఇది రామాయణములో కలదు.

ఇతరులకు దుఃఖము కలుగజేయువాడు తన దుఃఖ బీజములను తానే నాటుకొనినవా డగును. ఇట్లే సుఖము గలుగజేయువాడు తన సుఖబీజములను తానే నాటుకొనినవా డగును.

## మరణించినవారు మరల పుట్టుటకు కారణములెవ్వి?

మరణించినవారు పుణ్యాపాపకర్మల ఫలితముల ననుసరించి భగవంతుడు మానవులుగా మరల పుట్టునట్లు కొందరిని నియమించును. కొందరు భక్తులుగా, రాజులుగా, మహాత్ములుగాను పుట్టుదురు.

కొందరు మృగములుగాను, పక్షులుగాను, పశువులు గాను, రాళ్లుగాను, నదులుగాను పుట్టుదురు. కొందరు వృక్షములుగా, పాములుగా, పురుగులుగాను పుట్టుదురు.

## పూర్వము కామము (కోరిక) చే జన్మించిన వారెవరు?

బలిచక్రవర్తియొక్క కుమార్తె శ్రీహరియొక్క వామనావతారమును చూచి ముద్దుపెట్టుకొనవలెనను కోరికగలదై యుండెను. మరుజన్మమున వామనుడు శ్రీకృష్ణుడై అవతరించినపుడు పూతనగా పుట్టి వచ్చి ముద్దు పెట్టుకొని పాలు యిచ్చి మరణించెను.

నీలలోహితుడను రాజు కలకంధర అను స్త్రీతో నుండెను. వీరిరువురును చనిపోయిరి. కామముచేత హరిశ్చంద్రుడుగా, చంద్రమతిగా పుట్టి దంపతులైరి.

సతీదేవి చెలికత్తె సతీదేవి దక్షుని యజ్ఞగుండములో పడి చనిపోయిన తరువాత శివుని వివాహ మాడగోరి తపస్సు చేసెను. సతీదేవి మరల పార్వతిగా అవతరించి చెలికత్తెను శపించెను. అందువలన ఆమె భూలోకమున పుట్టి జయ అను పేరు పెట్టబడి హరిశ్చంద్రునికి భార్య అయ్యెను. తరువాత

కొంతకాలమునకు రహస్యముగా శివుడు జయ యున్న భవనమునకు వచ్చి ఆమెతో సంగమము చేసెను. అపుడు నందీశ్వర, భృంగీశ్వరులను ఇరువురు బిడ్డలు పుట్టిరి. వీరిని హరిశ్చంద్రుడు శివునికి పుట్టినట్లుగా ఊహించి జయను అడిగి తెలిసికొని శివునివద్దకు పంపివేసెను.

వాల్మీకి ఉంచుకొనిన స్త్రీ వాల్మీకి తులసీదాసుగా పుట్టినపుడు కామముచేతనే పుట్టి తులసీదాసునకు భార్య యయ్యెను.

శ్రీశుకమహర్షిని చెడగొట్టుటకు వచ్చిన రంభ శుకుడు కబీరుదాసుగా పుట్టినపుడు కామముచేతనే పుట్టి భార్య యయ్యెను.

మధురానగరమున ఒక స్త్రీ ఒక సాధువుపై మోహము గలిగియుండెను. తరువాత ఇరువురున్ను కొంత కాలమునకు చనిపోయిన కొలదిదినములకే మరల పుట్టి పెరిగి దంపతులైరి. సాధువు విరక్తిభావముగలవాడగుటచేత భార్యాసంగములేనివాడై వివాహమైన కొద్దిదినములకే మరణించెను.

## క్రోధముతో జన్మించినవారు

కైక తండ్రియగు కేకయరాజు ఒకనాడు అడవికివెళ్లి మగలేడిని బాణముతో కొట్టి చంపగా ఆడలేడి తన తల్లికి చెప్పుకొనెను. అపుడు తల్లిలేడి మందరయను పేరుతో మానవస్త్రీగా పుట్టి తన అల్లుని చంపినాడను క్రోధముతో నుండి పుట్టినది కనుక కైకకు దాసీగా నుండి మాయమాటలు

చెప్పి కేకయరాజుయొక్క అల్లుడగు దశరథుడు చనిపోవునట్లు చేసెను. ఈ కథవలన విరోధులు మరల పుట్టి బాధగలిగింతు రని గ్రహించి ఎవ్వరికిన్ని విరోధము కలుగు పనులను చేయకూడ దను నీతిని గ్రహించవలెను.

అర్జునుడు యుద్ధములో భీష్మాచార్యులను కొట్టి చంపి నాడు కనుక భీష్ముని తల్లియగు గంగకు క్రోధము కలిగెను. అందువలన "అర్జునుడు ఆరుమాసములలో చచ్చునుగాక" యనిశపించెను. జ్వాలాదేవి అర్జునుడు తనకుమారుని చంపినా డను క్రోధముతో అర్జునుని కుమారుడగు బభ్రువాహనుని చేతిలో బాణముగా పుట్టి అర్జునుని తలను నరికించెను. తరువాత శ్రీకృష్ణుడు అర్జునుని బ్రతికించెను.

అంబ భీష్మాచార్యులపై క్రోధముగలదై శిఖండిగా పుట్టి భీష్ముని చంపించెనుగదా! ఈ కథవలన క్రోధముగలుగు పనులు జేయుట అనర్థకములకు కారణము లగునని తెలియ వలెను.

శ్రీరాముడు వాలిని చంపుటవలన వాలి క్రోధము నుంచుకొనినవాడై మరుజన్మమున రాముడు శ్రీకృష్ణుడుగా పుట్టిన తరువాత వాలి కిరాతకుడుగా పుట్టి శ్రీకృష్ణుని బాణముతో కొట్టి చంపెను. ఇదియు క్రోధముయొక్క ఫలితమేగదా !

ఒక సాధుపుంగవుని ధనమును ఒక వైశ్యుడు దొంగిలించెను. అందువలన సాధువు క్రోధముతో మరణించి మరల వైశ్యునకు కుమారుడుగా పుట్టి రెట్టింపు ధనమును ఖర్చు పెట్టించి మరణించెను.

ఈ కథయు క్రోధము జన్మమునకు కారణ మగునని తెలియజేయుచున్నదిగదా !

ఒక యోగి సేవచేయుచున్న మునికుమార్తెపై క్రోధముగలవాడై అజామిళుడుగా పుట్టెను.

ఒక ఊరిలో ఒక ధనవంతుడు తన యింటిలో దాసీగా యుండి సేవచేయుచుండు స్త్రీయొక్క ఆస్తిని పాడుచేసెను. అందువలన ఆ స్త్రీ క్రోధముతో మరణించి పిశాచమై ఆ ధనవంతుని కుమారునకు పుట్టిన బిడ్డలను చంపెను. చాలా కాలమునకు దయ్యముయొక్క చరిత్ర తెలియబడగా ఆ దయ్యమునకు బలుల నర్పించి ఆ పిశాచమువలన గలిగెడు బాధలనుండి విముక్తినొంది ధనవంతుని కుమారుడు క్షేమముగా నుండెను.

ఈ కథవలన క్రోధముతోనున్నవారు బిడ్డలుగాను, దయ్యములుగానుపుట్టి పీడించెదరని, దుఃఖములపాలుచేయుదురనియును తెలియుచున్నదిగదా!

## భయముతో జన్మ

శివశర్మ కుమారుడు సోమశర్మ అరణ్యములో తపస్సు చేయుచుండగా సమీపమున రాక్షసుల కేకలువిని భయముతో రాక్షస స్మరణచేసి ప్రాణమును వదలి మరుజన్మమున రాక్షస రాజు యగు హిరణ్యకశిపునకు బిడ్డగా జన్మించెను. అతడే ప్రహ్లాదుడు.

# మమకారముచే జన్మ

జడభరతుడు లేడిపిల్లను పెంచుచు అంత్యకాలమున మమకారముతో లేడిపిల్లను స్మరణచేయుచు ప్రాణమును వదలి మరు జన్మమున లేడిగా పుట్టెను.

ఒక బౌద్ధమతాధిపతి అంత్యకాలమునకూడ మఠముపై మమకారము నుంచుకొని ప్రాణమును త్యజించి మరల జన్మించి పెరిగి వచ్చి "ఈ మఠము నాదే" నని పూర్వజన్మమునగల సంబంధవిశేషముల నన్నిటిని చెప్పెను.

ఒక గురువుయొక్క శిష్యుడు గురువుగారు సన్న్యాసము తీసికొనుమని చెప్పుచున్నను భార్యాబిడ్డలపై, గృహముపైని గల మమకారముచేత సన్న్యాసాశ్రమమును తీసికొనక చివరకు మరణించి కుక్కగా పుట్టి గృహమును కాపలా కాయుచు, కాపాడుచు కొంతకాలమునకు మరణించి పాముగా పుట్టి బిడ్డల ధనపుపెట్టెను ఆశ్రయించి కాపలా కాయుచుండగా బిడ్డలు చూచి పామును కఱ్ఱతో నలుగగొట్టిరి. ఇంతలో గురువు వచ్చి పామును తీసికొనిపోయి ధర్మములను బోధించెను. తరువాత కొంతసేపటికి పాము ప్రాణమును వదలెను.

ఈ కథవలన మమకారముచేత మరల మరల పుట్టుచుందురని తెలియుచున్నదిగదా!

దశరథుడు మరణించిన తరువాత శ్రీరాముని చూచుటకు రావణవధానంతరము ఇంద్రాదిదేవతలతో దశరథుడును వచ్చి "శ్రీరామా! నీవు నాకుమారుడవే" యని మమకారముతో పలికెను.

# భక్తితో జన్మ

గుడాకేశుడు అను భక్తుడు విష్ణువునుగూర్చి తపస్సు చేయగా కొంతకాలమునకు విష్ణువు ప్రత్యక్షమై "నీ తపమునకు మెచ్చితిని, వరము కోరుకొను" మనగా "నేను నీపూజాదులకు ఉపయోగపడే రాగి మొదలగు లోహములుగా నా శరీరమును చేయవలసి" నదిగా గుడాకేశుడు వరమును కోరెను. అట్లే జరిగెను.

శ్రీ రామకృష్ణ పరమహంసగారి దగ్గరకు ఇరువురు విద్యార్థులు భక్తితో వచ్చుచు పోవుచుండెడివారు. కొంత కాలమునకు వారిరువురున్ను మరణించి మరల కొన్ని నెలలకు పుట్టి కొలదిసంవత్సరములు గడచిన తరువాత శ్రీ రామ కృష్ణ పరమహంసగారి దగ్గరకు వచ్చి శిష్యులై సన్న్యాసా శ్రమమును స్వీకరించి ఉత్తమయతు లనబడిరి.

హుబ్బళ్లి శ్రీసిద్ధారూఢస్వాములవారితో వేదాంత శాస్త్రవాదము చేసిన పండిత సుబ్బయ్యశాస్త్రి చనిపోయిన కొన్నిమాసములకు పుట్టి వచ్చి సిద్ధారూఢస్వాములవారి ఆశీర్వాదము నొందెను.

శివపూజకు రానని ధిక్కరించిన గంధర్వుడు శాపము నొంది పులిగా పుట్టి శ్రీశైలమున తిరుగుచు కొంత కాలమునకు మరణించి నరజన్మమెత్తి శ్రీసిద్ధారూఢస్వాముల వారి సన్నిధికి చేరి శిష్యుడయ్యెను.

ద్వాపరయుగమున శ్రీకృష్ణభగవానుని అనుగ్రహ మునకు పాత్రురాలైన గూని కుబ్జ కలియుగమున జనాబాయిగా పుట్టి పరమభక్తురాలని ప్రఖ్యాతివహించెను.

శ్రీ రమణమహర్షి తపస్సుచేయుచున్న కాలములో ఒక స్త్రీ అప్పుడప్పుడు ఋషిగారికి తోటకూరను పెట్టుచుండెడిది. ఆమె కొంతకాలమునకు చనిపోయి మరల గోవుగా పుట్టి శ్రీ రమణాశ్రమములో జీవితపర్యంతము పూజింపబడెను. శ్రీ రమణమహర్షి ప్రేమతో దాని దేహమును నిమురుచు మంచి ఆహారమును పెట్టించెడివారు. ఆ గోలక్ష్మి జీవితచరిత్ర గ్రంథములను ఇప్పుడు శ్రీ రమణాశ్రమములో విక్రయించెదరు.

ఈ కథవలన భక్తితో మరణించినవారును మరల పుట్టుదురని తెలియుచున్నదిగదా!

## పాపముచే జన్మ

ఒకడు దేవాలయమునకు ( మఠమునకు ) అధిపతిగానుండి దేవుని సొమ్మును అపహరించిన దోషమువలన కుక్కగా పుట్టి శ్రీరామచంద్రుని దర్శనమునకు వచ్చెను.

ఒకడు కన్నతండ్రిని కొట్టిన దోషమువలన పులిగా పుట్టి కొంతకాలమునకు మరణించి మరల ఉడుతగా పుట్టి వచ్చి శ్రీరామచంద్రుడు వారధి కట్టుచుండగా సహాయము చేసెను.

ఒకడు అనేకములైన అన్యాయకృత్యములు చేసి పురుగుగా పుట్టి వేదవ్యాసుల దర్శనముచేసికొని తన పూర్వ వృత్తాంతముల నన్నిటిని చెప్పి దుఃఖించెను.

ఈ కథలవలన పాపకర్మల జేయుటవలన పలు విధములుగా జన్మలు కలుగునని గ్రహించి పాప మనిన భయము నొందవలెను.

## పరిగ్రహచింతచే జన్మ

అగ్నిశిఖమహర్షి నదిలో స్నానముచేసి వచ్చుచుండగా కాళ్లు కాలుచుండెను. అపుడు దారిలోగల చెప్పులపై కాళ్లువేసి, ఓర్చుకొనలేక ఎవరో ఇచటనుంచిన చెప్పులపై కాళ్లువేసితినిగదా యను చింతనతో నున్నవాడై కొన్ని దినములకు మరణించి చెప్పులువేసిన మాదిగవానికి కుమారుడుగా పుట్టి ఎనిమిది సంవత్సరములు పెరిగి భగవ ద్ధ్యానముతో కూర్చొని దేహమును వదలిపోయెను. ఈ కథవలన ఇతరుల సొమ్మును అనుభవించినవారు ఇతరులకు ఋణస్థులై జన్మమెత్తెదరను విషయము తెలిసినదిగదా!

ఒకడు కట్టెలను అమ్ముకొనుచు జీవించుచు కట్టెలను తీసికొని డబ్బు నివ్వనివానికి కుమారుడుగా పుట్టెను.

ఒకడు సజ్జనులకు ఒక వస్తువు నిచ్చెదనని చెప్పియు ఇవ్వనందున మరుజన్మమున నక్కగా పుట్టెను.

ఒకడు పెద్దలకు దాచబడిన ఆహారమును రహస్యముగా తీసికొని భుజించినందున మరుజన్మమున కోతిగా పుట్టెను.

బాల్యమునుండియు మంచిపనులతో, మంచి భావములతో నున్నవారికి వృద్ధులైనను, మరణకాలమాసన్న మైనను మంచిభావము లుండును.

మరణకాలమందు దేనిని స్మరించుచు ప్రాణమును త్యజింతురో, దాని ననుసరించియే జన్మము గలుగును.

పాపకర్మదోషము ననుసరించియు, అంత్యకాలస్మరణ ననుసరించియు అనేకులు మానవులుగా, జంతువులు (మృగములు) గా, చెట్లుగా, అంగహీనులుగా, రోగులుగా, దరిద్రులుగాను పుట్టుదురు.

ప్రశ్న : స్వామీ, అంత్యకాలములో శ్రీరామా యని, శ్రీకృష్ణా యని, శివ శివా యని, ఓమ్ ఓమ్ యనియు స్మరించుచు ప్రాణమును వదలినవారిని నేను అనేకమందిని చూచితిని. వా రందరకును మోక్షపదము దొరకునా?

ఉత్తర : " ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మా మనుస్మరన్ ". భగవంతుని స్మరించుచు దృష్టి దేవునిపై నుంచవలెను.

అనేకులు అంత్యకాలమున భగవన్నామమును తలనొప్పిపై దృష్టినుంచిగాని, కడుపునొప్పిపై దృష్టిని పెట్టిగాని, గుండె దడపై నుంచిగాని, కఫముపైగాని, భార్యాబిడ్డలపై గాని, ధనధాన్యభూములపై దృష్టినుంచిగాని స్మరించుచున్నారు. ఇట్టివారికి సద్గతి లేదు. దేవునిపై, పరమాత్మపై దృష్టినుంచుకొని దేవునినామమును స్మరించుచు దేహమును వదలిన వారికే సద్గతి గలుగును.

అకస్మాత్తుగా మరణించువారలలో కొందరు పుణ్యాత్ములుందురు. కొందరు పాపాత్ము లుందురు.

దీర్ఘకాలము బాధలుపడి మరణించువారలలో కొందరు పుణ్యాత్ము లుందురు. కొందరు పాపాత్ము లుందురు.

మారీచుడు శ్రీరామచంద్రుడు కొట్టిన బాణముచే లేడిశరీరమును వదలి రాక్షసరూపము దాల్చి శివ శివా యని స్మరించుచు శివలింగ మయ్యెను. ఈ లింగము ఇప్పటికిన్ని గోదావరి జన్మస్థానమగు నాసిక్ నందు 'మారీచేశ్వరలింగ' మను పేరుతో పూజింపబడుచుండెను.

కాశీలో వెలసియున్న సురాభాండేశ్వరుడు పూర్వము బ్రాహ్మణుడు. ఇతడు గవళ్ళస్త్రీ వెంట కాముకుడై పోయెను. ఇంతలో ఆమె భర్త రాగా ఈ బ్రాహ్మణుని పెద్ద కల్లు భాండములో నుంచెను. భయముతో శివునిపై దృష్టినుంచి ధ్యానించుచు శివలింగ మయ్యెను.

ఆపత్కాలములో నున్నవారికి సహాయముచేయగల శక్తి గలిగియుండియు సహాయము చేయకయున్నవారు మరు జన్మమున దుఃఖముతోగూడిన జన్మ మెత్తెదరు.

కామకోటి పీఠాధిపతులలో సచ్ఛిద్ఘనజయేంద్ర సరస్వతీస్వాములవారు కంచి దేవాలయములో అంత్యకాల మున శివుని ధ్యానించుచు శివలింగాకృతి నొందెను (ఈయన పదమూడవ పీఠాధిపతి). ఇట్లే, ఇరువదిఐదవ పీఠాధిపతియగు సచ్చిదానందఘనజయేంద్ర సరస్వతీస్వాములవారున్ను గోకర్ణ క్షేత్రములో అంత్యకాలమున శివుని ధ్యానించుచు శివలింగ మయ్యెను.

మీరాబాయి శ్రీకృష్ణునిలో లీనమయ్యెను. సక్కుబాయి శ్రీ పాండురంగనిలోను, శ్రీమతి తరికొండ వేంకమాంబ శ్రీ వేంకటేశ్వరునిలోను, భక్తగుడగూచి శివలింగములోను లీనమైరి.

# భర్తలను మార్చిన భార్యల కథలు

## (బౌద్ధమతస్థుని శివభక్తుని చేయుట)

కథ : మధురానగరమును కూన్ పాండ్యన్ అనే రాజు పాలించెను. అతడు బౌద్ధమతమును స్వీకరించిన వాడై ఎవ్వరును విభూతి పూయరాదని, రుద్రాక్షలు వేసికొనరాదనియును కట్టడిచేసెను. రాజు భార్యయు, మంత్రియును శివభక్తులు. రాజాజ్ఞను అతిక్రమించలేక బాధపడుచు రాజు శివారాధనచేయు దినములు ఎప్పుడు వచ్చునా యని చింతతో నుండిరి.

రాజుగారికి శివసంకల్పముచే జ్వరము వచ్చినది. కొన్ని దినములకు రమణమహర్షి పూర్వజన్మ అవతార మూర్తియగు జ్ఞానసంబంధమూర్తి శిష్యులతో ఆ నగరమునకు వచ్చి ఒక ఇంటిలో బసచేసిరి. అపుడు మంత్రియు, రాణిగారున్ను వచ్చి రాజుగారి వృత్తాంతమును సవిస్తరముగా జ్ఞానసంబంధమూర్తిగారికి తెలియజెప్పిరి. మరునాడే ఆ బౌద్ధులు సంబంధుల గృహమునకు అగ్ని ముట్టించిరి. ఆ అగ్నియొక్క వేడి రాజుగారి శరీరములో జొరబడి జ్వరబాధ అధికమగులాగున జ్ఞానసంబంధులు చేసిరి. అందుచే రాజుగారు విశేషము బాధపడుచుండెను. రాణి, మంత్రియు "జ్ఞానసంబంధులను పిలిపించినచో మీ జ్వరము తగ్గు"నని రాజుగారికి చెప్పగా అందుకాయన అంగీకరించెను.

సంబంధులు వచ్చి బౌద్ధ సన్యాసులతో "రాజుగారి కుడిభాగములోని జ్వరమును పోగొట్టుడు. నేను ఎడమ

భాగములోని జ్వరము పోగొట్టెద" ననెను. అపుడు బౌద్ధ సన్న్యాసులు రాజుగారి జ్వరమును తగ్గించలేకపోయిరి. జ్ఞానసంబంధమూర్తిగారే రాజుగారి జ్వరమును పూర్తిగా పోగొట్టిరి. బౌద్ధులు ఓడిపోయిరి. "మీ సిద్ధాంతమును ఒక తాటియాకుపై వ్రాయుడు. మా సిద్ధాంతము నొక తాటియాకుపై వ్రాసెదము. ఈ రెంటిని ఒక నదిలో వేయుదము. రెంటిలో ఏది ప్రవాహమునకు ఎదురుగా పోవుచుండునో అదే గొప్పమతమని నిశ్చయించుకొనవలె "నని అట్లే చేయగా ఈ రెండవసారికూడ ఓడిపోయిరి. అగ్నిలోపడవేసినచో కాలకయున్నచో ఆ మతమే గొప్పదని చెప్పిన బాగుండునని నిశ్చయించుకొని రెండు తాటాకులను అగ్నిలో పడవేయగా బౌద్ధులతాటాకు కాలి భస్మమయ్యెను. శైవమతతాటాకు కాలక యున్నది. మూడవసారియు ఓడిపోయిరి. అపుడు రాజు శివమతస్థుడయ్యెను.

## నాస్తికుని భక్తునిగా మార్చుట

ఒక పట్టణములో ఒక ఉద్యోగస్థుడు కలడు. అతడు నాస్తికుడు. అతనిభార్య ప్రతిదినమును పూజ, జపము, ప్రార్థన, గీతాపారాయణ చేసికొనుచు బిడ్డలచేతకూడ ప్రార్థన, పూజలను చేయించుచుండెడిది. భర్త "దేవుడూలేడు, దయ్యమూలేదు. జగము సహజముగా చావు పుట్టుకలతో నుండునేగాని దీని కొక కర్తలే"డని భార్యతో వాదన చేయుచు, భార్య చేయుచున్న దైవపూజ, ప్రార్థనాదులను చూచుచు తిట్టుచుండును.

ఒకనాడు భర్త గ్రామాంతరమునకు వెళ్లగానే డ్రాయింగు నేర్చుకొనియున్న ఆమె మిక్కిలి సుందరముగా ఒక శ్రీకృష్ణచిత్రమును వ్రాసి భర్త గదిలో పెట్టెను. దానిని భర్త వచ్చి చూచి సంతోషముతో వర్ణించుకొనుచు "దీని నెవరు వ్రాసిపెట్టిరి?" అని అడిగెను. అపుడు భార్య "సహజముగా తనంతట అదే యేర్పడిన"దని చెప్పెను.

"ఛీ ఛీ, బుద్ధిలేనిదానా! ప్రతివస్తువునకు నిర్మాణకర్త యుండునుగదా! ఎవ్వరూ వ్రాసి పెట్టలే దనెదవేల" అనెను. అపుడు భార్య "అదేనండీ నేను కూడ చెప్పునది. కర్తలేకుండ ఈ జగ మేర్పడలేదు. ఆ కర్తయే దేవుడని చెప్పబడు చున్నాడు. ఆ భగవంతుని నమ్మి సేవించుచు అహంకార, మమకారములను త్యజించవలెనని సద్గురువులు చెప్పిరి, భగవద్గీతాది శాస్త్రములున్ను చెప్పుచున్న"వని చెప్పెను. అపుడు భర్తహృదయము మార్పుజెందినది. భార్యతోపాటు అతడుకూడ పారాయణ, ప్రార్థన, పూజాది సత్కర్మలలో పాల్గొనుచు ధన్యుడయ్యెను.

## క్రియాద్వైతునికి భావాద్వైతబోధ

ఒకరాజు ఒక మహాత్ముని వద్దకు వెళ్లి ఆయన అద్వైత బోధను విని, 'బ్రహ్మ సత్యం. జగత్తు మిథ్య. అందరిని సమానముగా గాంచుటయే జ్ఞానము' అని నిశ్చయించుకొని ఇంటికివచ్చి భార్యతో "ఓ సుందరీ, ఇకనుండి నాకు నీవును, దాసియు సమానులే. కనుక నీవును, దాసియు భేదము లేకుండ వర్తించవలెను" అని చెప్పెను.

అపుడు రాణీగారు రాజుగారికి బంగారపు పళ్లెరములో అన్నము, కూరలున్ను వడ్డించి పేడను కూడ పళ్లెరములో పెట్టెను. రాజుగారు భుజించుటకు వచ్చి చూడగా పేడ కనబడెను. వెంటనే క్రోధముతో "ఛీ ఛీ, ఏ పాపి అన్నము ప్రక్కన కూరలతో పేడనుకూడ పెట్టినది"అని కేకలువేసెను. వెంటనే భార్య వచ్చి "ఏమండీ, మీ కింకను భేదదృష్టి పోలేదా? సర్వము బ్రహ్మమే గదండీ! అన్నమని, కూరయని, పేడయని భేదము నెంచెదరేల" అనెను. అపుడు రాజుగారికి కనువిప్పు గలిగెను. రాణీగారు రాజుగారితో నిట్లు చెప్పెను: 'భావములో అద్వైతము నుంచుకొనవలెనేగాని క్రియలలో అద్వైతవర్తన కూడదని నా గురువుగారు చెప్పిరి. క్రియలలో (వ్యవహారములలో) ధర్మమునకు, నీతికి, క్షేమమునకు భంగములేని భేదముతో వర్తించుచుండవలెను.'

ఒక ఊరిలో ఒక పండితుడు కలడు. అతఁ డొకచోట ఉపన్యాస మిచ్చుచు వంకాయకూర రజోగుణపదార్థము గాన దానిని భుజించకూడదని చెప్పెను. ఈవిషయమును అతని భార్య కూడ వినెను. ఉపన్యాసానంతరము బల్ల దిగి వెళ్లుచుండగా వంకాయలను అమ్మువాడు కనుపించెను. అతనితో పండితుడు "ఈ వంకాయలను మా యింటికి తీసి కొనివెళ్లి యివ్వ"మనెను. అతడట్లే ఇచ్చి వెళ్ళెను. పండితుడు ఇంటికివచ్చి స్నానముచేసి భోజనమునకు కూర్చొని భార్య వడ్డించిన తరువాత "వంకాయకూర వడ్డించలేదే?" అని ప్రశ్నించెను. అపుడు భార్య "వంకాయకూర తినగూడదని మీరే సభలో అనేకమందికి చెప్పినారుగదా! చెప్పే దొకటి, చేసే దొకటిగా నుంటే పండితులకు, పామరులకును

తేడా యేముండును” అని బుద్ధి చెప్పెను. దీనితో పండితుని బుద్ధి ఆచరణావైపుకు తిరిగినది.

ఇట్టిదే యింకొక కథ గలదు. ఒక ఊరిలో క్రైస్తవపంతులు కలడు. అత డొకనాడు ప్రక్కయింటి వారి కోడిని పట్టుకొని గంపక్రిందపెట్టి భార్యతో “ఈకోడిని కోసి కూర వండుము. నేను చర్చికి వెళ్లి బోధచేసి వచ్చెదను” అని చెప్పి వెళ్ళెను. భార్య సుగుణవంతురాలు యగుటచేత రహస్యముగా తాను భర్త బోధ వినుటకు వెళ్ళెను. అచట భర్త “హింస, అసత్యము, దొంగతనము, వ్యభిచారమును చేయకూడనిపనులు, దుష్టపనులను చేయుచుండువారు దేవుని కృప నొందలేకపోవుటయేగాక దేవునిచే శిక్షింపబడుదురు” అని బోధించెను. ఈమాటలను భార్య విని ఇంటికి పోయి తట్టక్రింద నున్న కోడిని విడిచి పెట్టెను. కొంతసేపటికి పంతులు ఇంటికి వచ్చి “కూర తయారైనదా” యని ప్రశ్నించెను. అపుడు భార్య భర్తతో “దొంగతనము చేయకూడదని మీరు బోధించినారుగదా! మీరుచేసిన పాపమును నేనుకూడా పంచుకొనవలెనా? మీరుచేసిన పని ఇతరులకు తెలిసినచో దూషించరా? దేవుడు శపించడా? చివరకు నరక దుఃఖము కలుగక తప్పునా” యని ప్రసంగించెను. అపుడు పంతులు భయపడిన వాడై అప్పటినుండి దుష్టపనులకు స్వస్తిచెప్పెను.

పంచపాండవులు కౌరవులను చంపినతరువాత “బంధుమిత్రాదులను చంపించితినిగదా” యని ధర్మరాజు దుఃఖపడుచు “నాకు రాజ్యమువలదు. నేను సన్న్యాసినై

భిక్షమెత్తుకొని భుజించుచు జీవితమును గడపెద” నని చెప్పగా ద్రౌపదీదేవి ధర్మరాజునకు రాజధర్మములను బోధించినట్లు భారతము శాంతిపర్వమునందు కలదుగదా!

జనకమహారాజుకూడ వైరాగ్యదృష్టికలవాడై రాజ్యమును వదలి భిక్షమెత్తుకొని భుజించుచు తపస్సు చేసికొందునని తన నిర్ణయమును చెప్పగా, జనకుని భార్య రాజ ధర్మములను చెప్పి వారింప జేయలేదా! (శాంతిపర్వము)

శిఖధ్వజమహారాజు విరక్తిదృష్టితో రాజ్యమును వదలి ఒక మహారణ్యమునకు పోయి తపోవృత్తితో నుండెను. అపుడు ఆయన భార్యయగు చూడాల భర్తకు జ్ఞానబోధ చేసి మరల ఇంటికి తీసికొనివచ్చి రాజ్యపరిపాలన చేయించ వలెనను నిశ్చయబుద్ధితో భర్తయున్న మహారణ్యమునకు వెళ్లి “రాజ్యపరిపాలన చేయుట వదలి ఈ వనములో నివసించుట నిజమైన వైరాగ్యముకా” దని ఆక్షేపించెను.

అపుడు రాజు ఇట్లనెను:

నేను రాజ్యమును వదలితిని. గృహమును వదలి పెట్టితిని. దేశమును త్యజించితిని. భార్యను విడచితిని. బిడ్డలను విడచివేసితిని. ఇంతకంటె త్యజింపదగినది యింకేమున్నది?

ఓ సౌందర్యనిధీ! దేనిచేత ఈ దేహము కదలింప బడుచున్నది? ఏది జన్మములకు, కర్మలకును మూలమగును? దేనిని విడచినయెడల సర్వత్యాగము సిద్ధించినట్లగును?

చూడాల సమాధాన మేమనగా:

జన్మలకును, కర్మలకును చిత్తమే వి త్తనబడుచున్నది. గాలికి వృక్షము కదలుచున్నట్లు చిత్తముచేతనే దేహము కదలుచున్నది. చిత్తమును (మనశ్చలనమును) త్యాగము చేయుటయే నిజమైన త్యాగ మనబడునని త్యాగము యొక్క నిజము తెలిసిన పెద్దలు చెప్పుచున్నారు. చిత్తమును విడిచినప్పుడే 'నేను నీవు, నాది నీది' యను భేదభావము లన్నియు నశించును. చిత్తత్యాగముచే శాశ్వతమైన పరమశాంతి లభించును. సర్వత్యాగమే పరమానందము. తక్కినవి గొప్పదుఃఖరూపములే యగును.

ఈవిధముగా చూడాల తనభర్తకు బోధించి స్వగృహమునకు తీసికొనివెళ్లి రాజ్యపరిపాలనభారమును మీద పెట్టెను. రాజు జ్ఞానవంతుడగుటచేత జనకమహారాజువలె రాజ్యమును పరిపాలించెను.

(శ్రీ) బుద్ధదేవుని దగ్గరకు భక్తురాలగు ఒక రాణి వెళ్లుచు ఆ మహాత్ముని ధర్మబోధనలను శ్రవణముచేసి వచ్చుచుండెడిది. ఆమె భర్తయగు రాజుగారికి కోపమువచ్చి భార్యను తిట్టుటయేగాక (శ్రీ) బుద్ధభగవానునికూడ దూషణముగా మాట్లాడుచుండెడివాడు. ఒకనాడు రాణీగారు రాజుగారినికూడ తన మార్గమునకు త్రిప్పదలచి రాజును సమీపించి "నాథా! మనము ఏ ఏ వస్తువులను, జీవులను ప్రియమైనవిగా తలంతుమో అవన్నియును దుఃఖకారణములగునని బుద్ధభగవానులు సెలవిచ్చిరి" అని చెప్పెను. అపుడు రాజుగారు "సంపాదించుకొనిన ప్రతిదీ సుఖమునకు కారణమగునేగాని దుఃఖమునకు కారణముకా" దని విపరీతముగా పలికెను. అపుడు రాణి రాజుగారి నిట్లు ప్రశ్నించెను:

రాణి : నాథా, మన కుమార్తెయగు వజ్రిణి మీకు ప్రియమైనదేనా ?

రాజు : మల్లికా, ఏ మట్లందువు ? ఏకైకపుత్రికగదా ! మిగుల ప్రియమైనది.

రాణి : నరపాలా, ఆ కుమార్తెకు ఏదైన సంకటము కలిగినను, చెడుకలిగినను మీకు చీకు, దుఃఖము, ఆయాసములు కలుగునా ?

రాజు : ప్రియురాలా, అది ఇది యేమిటి ? ప్రాణములు నిలుచునో, నిలువవో !

రాణి : నాథా, అందువలనే శ్రీ బుద్ధదేవుడు దుఃఖములన్నియు ప్రియవస్తువులవలన గలుగునని చెప్పెను. నాథా, మీ సేనాపతి (మంత్రి) మీకు ప్రియుడేనా ?

రాజు : మల్లికా, అశురాలా ప్రియుడే.

రాణి : ప్రభూ, ఆయనకు ఏదైనా సంకటము వాటిల్లినచో, చెడుగు దాపురించినచో మీకు చింతలు, క్లేశము, దుఃఖములు సంభవింపవా ?

రాజు : వెయ్యేల, నేను జీవించుటయే సందేహమగును.

రాణి : మహారాజా, అందుకే బుద్ధుడు చింతలును, దుఃఖములును ప్రియవిషయములచే కలుగునని చెప్పుటకు కారణమైనది.

కోసలేశ్వరా, ఈ పట్టణములోని ప్రజలు మీకు ప్రియపాత్రులేనా ?

రాజు : ఆహా! అవశ్యము. ఈ సుఖభోగములకు కారణము వారి శ్రేయస్సేగదా!

రాణి : భూపాలా, ఆ ప్రజలు కడగండ్లకు (కష్టాలకు) గురియగుచో?

రాజు : ప్రేయసీ, ఏమట్లందువు? నా జీవితసౌధము నకు పిడుగుపాటు.

రాణి : భూనాథా, బుద్ధుడు బూటకములాడువాడా! పోనిమ్ము. మహారాజా, నేను మీకు ప్రియురాలనేనా?

రాజు : చెలీ, ప్రియురాలవేమిటి, ప్రియతమురాలవు!

రాణి : నాథా, నాకేమైన చేటు మూడినచో?

రాజు : ఛీ ఛీ, అమంగళము శాంతించునుగాక! దేవీ, నా ప్రాణములు నీతోడివై యున్నవి.

రాణి: స్వామీ, నాథా, ఇంతవరకు విచారించితిమే బుద్ధభగవానుడు శోకదుఃఖములన్నిటికిని ప్రియవస్తువులే కారణములగునని సెలవిచ్చెను.

రాజు : మల్లికా, ఒహోహో! అద్భుతము. ఆ చురుకు చూపుకు చొరరాని చోటు లేదు. ఆ అపారప్రజ్ఞకు అందరాని విషయము లేదు అని పలికి రాజుగారు ఆసనము నుండి లేచి బుద్ధభగవానుడున్న చోటునకు వెళ్ళి చేతులు జోడించి, భక్తితో మ్రొక్కి, తప్పటడుగులు వేయుచు "దేవా, నీవు సమ్యక్సంబుద్ధుడవు. నమస్కారము" అని ముమ్మారు పలికి, "నేను కూడ తమశిష్యకోటిలోనివాడ నని నిశ్చయించుకొాను" మని చెప్పుకొనెను.

తులసీదాసు మిక్కిలి కాముకుడు. ఆయన ఒకనాడు రాజుగారి వెంట అడవికి వెళ్ళెను. ఇంతలో అత్తగారికి జబ్బు చేసినదని ఒక మనిషి వచ్చి చెప్పి భార్యను పుట్టింటికి తీసికొని వెళ్ళెను. తులసీదాసు సాయంత్రమునకు ఇంటికి వచ్చి చూడగా భార్య కనుపించనందున తన తల్లిని అడిగి భార్య పుట్టింటికి వెళ్ళిన విషయమును తెలిసికొని సరిగా భోజనముకూడ చేయక అత్తవారింటికి బయలుదేరి అర్ధరాత్రి వేళకు భార్యదగ్గరకు వెళ్ళి "నీపైగల మోహమును నిగ్రహించలేక ఈ అర్ధరాత్రివేళ నీదగ్గరకు రావడమైన"దని చెప్పగా అపుడు భార్య యిట్లు చెప్పెను :

"అస్తి చర్మమయ దేహ మమతామే ఐసే ప్రీతి ।
తైసీ జో శ్రీరామమహాహోతి న తో భవభీతి ॥"

తా. నాథా! ఎముకలు, మాంసము, రక్తము, మలమూత్రాదులతో కూడియున్న నా యీ శరీరముపై ఇంత ప్రీతి నుంచెదరేల? ఈ ప్రీతిని త్రిభువనమోహనుడైన ఆ శ్రీరామచంద్రునిపై నుంచినయెడల సంసారభీతి (జనన మరణభీతి) నశించిపోవును అని చెప్పగనే తులసీదాసు గారి మనసు గిఱ్ఱున శ్రీరామప్రభువువైపునకు తిరిగినది. వెంటనే అచటనుండి కాశీక్షేత్రమునకు వెడలిపోయి శ్రీరామ ధ్యానముచేసి శ్రీరామదర్శనము నొంది గొప్ప మహాత్ము డయ్యెను.

రామాబాయి భర్త చెడువర్తన గలవాడు. ఆయన చెడువర్తనమును మాన్పించి మంచిప్రవర్తనగలవానినిగా రామాబాయి మార్పుచేయ దలచి ఒక ఏకాదశిరోజున

ఉపవాసవ్రతముతో నుండెను. ఆనాడే తన భర్త ఒక మేకను తెప్పించి కోయించి వంటవానిని కూర వండమని చెప్పెను. ఇంతలో రామాబాయి తనకుమారునకు విషముపెట్టి చంపెను. అపుడు తన భర్త మితిలేని దుఃఖములో మునిగి విలపించుచుండెను. అపుడు మెల్లగా రామాబాయి భర్త దగ్గరకు వచ్చి "ఎందుకు మీరు ఏడ్చెదరు? చచ్చినవాడు మరల బ్రతుకునా" యని చెప్పినను అదేపనిగా దుఃఖపడుచునే యుండెను. కొంతసేపైన తరువాత రామాబాయి భర్తతో "దేవాలయమునకుపోయి భక్తుల దగ్గర శ్రీహరి ప్రసాదములను తీసికొనివచ్చి చచ్చియున్న పిల్లవాని నోటిలో వేయుము బ్రతుకునేమో" యని చెప్పెను. భార్యమాటయందు నమ్మకము లేకపోయినను చేసిచూతమనుకొని దేవాలయమునకు వెల్లి భక్తుల నడిగి తీర్థప్రసాదములను తీసికొనివచ్చి చచ్చియున్న పిల్లవాని నోటిలో వేయగానే నిద్రనుండి లేచినవానిలాగా బ్రతికి లేచెను. అపుడు భగవద్భక్తుల మహిమ విశేషములను భర్త గుర్తించి చెడు వర్తనములను వదలి పరమభక్తుడయ్యెను.

సక్కుబాయి యొక్క శ్రీపాండురంగభక్తి ప్రభావముచేతనే ఆమె భర్త, అత్తయును, భక్తులైరి గదా!

నాస్తికభావముతో కాముకుడైయున్న లీలాశుకుడు చింతామణియొక్క హితోపదేశములను విని భగవంతుని భజించి పరమభాగవతోత్తముడై గ్రంథకర్తకూడ నయ్యెనుగదా!

ఆ. తనము బాగు గోరి ధర్మంబు జెప్పిన
దిట్టు చుండు నథము డెట్ట యెదుట
గడ్డి వేయ పోట్లగొడ్డు కొమ్మాడించు
విశ్వదాభిరామ వినుర వేమ.

## నా మలయాళ సద్గురు సంక్షిప్తకథ

మలయాళదేశములో ఎనంగడుయ్యార్ అను గ్రామ మందు కరియప్ప, నోట్టియమ్మ యను పుణ్యదంపతులకు క్రీస్తుశకము 1885 మార్చి 29-వ తేదీన శ్రీమలయాళ స్వామి జన్మించెను.

క్రమక్రమముగా పెరుగుచు విద్యాభ్యాసము పూర్తి చేసికొని భారతదేశములోని ఉత్తర దక్షిణ ప్రాంతములలో గల పుణ్యతీర్థస్థలములను కాలినడకతోనే తిరిగి సేవించిరి. యాత్రానంతరము, తిరుమల-తిరుపతి గోగర్భ పాండవగుహాలో తపస్సును ప్రారంభించి చేయుచు జీవిత భారమును శ్రీ వేంకటేశ్వరస్వామిపై నుంచెను.

ప్రతిదినమును ఊరిలోనికి వెళ్లి భిక్ష తెచ్చుకొని భుజించెడివారు. అప్పుడప్పుడు శ్రాద్ధపిండములనుకూడ భుజించి తపస్సులో నుండెడివారు.

ఒకనాడు ఒక భక్తుడు మట్టిపిడతలో మినప ఉండలను పెట్టి తీసికొనివచ్చి స్వామికి సమర్పించెను. ఒకసారి ఒక ఉండ తిని ధ్యానములో కూర్చొని యుండగా మినప ఉండలు గుర్తునకు వచ్చుచుండెను. అప్పుడు వాని నన్నిటిని ఇతరులకు పంచిపెట్టి పిడతను పగులగొట్టి పారవేసెను.

ఒకప్పుడు ఆహారములేక బాధలో నుండెను. అపుడు శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయాధికారి కలలో కనపడి ఫలానచోట నా భక్తుడు ఆకలితో బాధపడుచున్నాడు, అన్నమును పంపవలసినదని చెప్పెను. అప్పు డా యధికారి స్వామికి అన్నమును పంపించెను.

ఇంకొకప్పుడు గోగర్భగుహాముందుగల వాగు పొంగి పొరలి ప్రవహించుటచే స్వామి భిక్షకు వెళ్లుటకు వీలుపడలేదు. ఆకలితో బాధపడుచుండెను. అపుడు శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయాధికారికి స్వప్నములో "నాభక్తునకు అన్నమును పంపవలసిన" దని చెప్పగా, పెద్ద వాసము గడకు అన్నపుమూటనుగట్టి స్వామికి అందింప జేసెను.

శ్రీవారు 12 సంవత్సరముల 5 మాసముల 13 దినములు తపస్సుచేసి ఆత్మానుభూతి నొందిరి.

శ్రీ సద్గురుస్వాములవారు శిష్యబృందముతో శ్రీ అక్షయనామ సంవత్సర వైశాఖ కృష్ణపక్ష సప్తమి గురువారమునకు సరియగు 3-6-1926-వ తేదీని శ్రీ వేంకటాచలమును విడిచి శ్రీ వ్యాసాశ్రమమునకు విజయము చేసిరి. అప్పటినుండి శ్రీ వ్యాసాశ్రమము దినదినప్రవర్ధమానమగుచున్నది.

శ్రీవారు 3-2-1936-వ తేదీని భక్తులు ప్రేరణ చేయగా సన్న్యాసాశ్రమమును స్వీకరించిరి.

## గీతాప్రబోధ - సభలు

శ్రీ మళయాళ సద్గురుస్వాములవారి ఆధ్వర్యమున ఆంధ్రదేశములో నలుమూలల 1926 నుండి 1962 సంవత్సరము వరకు శ్రీ సనాతన వేదాంతజ్ఞానసభలు జరిగినవి. సభానంతరము భక్తుల కోరికపై అనేక నగర, గ్రామములకును వెళ్ళి ప్రబోధించిరి. షుమారు మూడు మాసములు ప్రచారము చేసెడివారు.

శ్రీ స్వాములవారు శిష్యబృందముతో రైళ్లమీద, బస్సులమీద, కార్లమీద, బండ్లమీద, పడవలమీదను ప్రయాణము చేసెడివారు. ఒకప్పుడు కృష్ణాజిల్లాలో సుస్తీ చేయుటచేత శ్రీవారు మేనాపై ప్రయాణము చేసిరి.

## శ్రీ వ్యాసాశ్రమ నియమములు

ప్రతిదినమును ఉదయము నాలుగు గంటలకు లేచి స్నానము చేయవలెను. ఐదింటికి సాధుభక్తాదు లందరు వచ్చి భగవద్గీతలోని ఒక అధ్యాయమును పారాయణ చేయవలెను.

మధ్యమధ్య శ్రీ స్వాములవారు ముఖ్యములైన శ్లోకముల గురించి వివరముగా బోధించెదరు.

పారాయణానంతరము స్త్రీ పురుషులు వారివారి రూములకు వెళ్లి జప ధ్యానముల జేసికొనెదరు.

నిశ్శబ్దముగా నుండవలెను. బిగ్గరగా మాట్లాడినను, నవ్వినను స్వాములవారు శిక్షించెడివారు.

ఉల్లి, వెల్లుల్లి మొదలగు తామసాహారములను భుజించరాదు. భోజన సమయమున మౌనముగానుండి భగవద్ధ్యానముతో భుజించవలెను.

స్త్రీలున్నచోటుకు పురుషులు వెళ్లగూడదు. పురుషులున్న చోటుకు స్త్రీలు వెళ్లగూడదు.

సాయంత్రము స్వాములవారి బోధ వినుటకు స్త్రీ పురుషులు వచ్చెదరు.

స్వాములవారి దేహబంధువులలో నెవ్వరైనను వచ్చినపుడు భోజనము పెట్టించి పంపెడివారేగాని వారితో మాట్లాడెడివారు కారు.

ఆశ్రమావరణలో చుట్ట, బీడీ వగైరాలను త్రాగనివ్వరు. తాంబూలము వేసికొని ఉమ్మి వేయకూడదు.

స్త్రీలను పిలువవలసినప్పుడు సంజ్ఞచేసి చేతితో రమ్మనరాదు. దగ్గరకు వెళ్లి మాట్లాడి రావలెను.

తగిన జతవారు లేనిదే స్త్రీలు ఒంటరిగా ప్రయాణము చేయరాదు.

టిక్కెట్టు లేకుండ రైళ్ళపై ప్రయాణము చేయువారిని ఆశ్రమావరణలో నుండ నివ్వరు.

## తప్పుచేసినవారికి శిక్షలు

ఒకప్పుడు స్వాములవారికి వంటచేయుచుండెడి బాపయ్య యను బ్రహ్మచారి ఎదురుగా వచ్చుచున్న ఆరు సంవత్సరముల వయస్సుగల ఆడపిల్లను పట్టుకొనెను. దీనిని

స్వాములవారు చూచి బాపయ్యను పిలిచి "ఆ విద్యార్థి పిల్లను ఎందుకు పట్టుకొంటివి?" అని అడిగెను. అప్పుడు "ముద్దువచ్చి పట్టుకొంటి" నని చెప్పెను. అందుకు స్వాములవారు "ఓరీ అవివేకీ, బ్రహ్మచారి స్త్రీని ముట్టవచ్చునా?" అని గట్టిగా మందలించి ఉపవాస ముంచెను.

కృష్ణాజిల్లాలో ఒక ఆశ్రమములో స్వాములవారు ఉపన్యసించుచుండగా ఆశ్రమాధిపతి స్వాములవారి బోధలను వినుచున్న ఒక వృద్ధస్త్రీ చేతిని పట్టుకొని ప్రక్కకు జరిగి కూర్చొనుమని లాగెను. అపుడు స్వాములవారు చూచి ఆశ్రమాధిపతిని పిలిపించి గట్టిగా మందలించెను.

గోదావరిజిల్లాలో ఒక ఆశ్రమములో వానప్రస్థులుగా వచ్చి నివసించుచున్న ఒక భక్తురాలి తలలో పువ్వు లుండుట శ్రీ స్వాములవారు చూచి పిలిపించి ఇది వైరాగ్యవంతుల లక్షణమేనా యని బుద్ధి చెప్పిరి.

స్వాములవారివెంట వచ్చుచున్న సన్న్యాసులను చూచి "ఒకచోటనుండి అనుష్ఠానముచేసికొనక బహుమతుల కొరకును, సుఖభోజనములకొరకును మా వెంట వచ్చుచున్నారా! పొండి, ఏదైన ఆశ్రమములో నుండండి" అని చెప్పి పంపివైచిరి.

తెనాలి ఆశ్రమములో ఇరువురు సన్న్యాసులు పోట్లాడుకొనుచు చెప్పులతో కొట్టుకొనిరి. అపుడు స్వాముల వారు వా రిరువురను సంఘమునుండి బహిష్కరించిరి. చాలా కాలము గడచిన తరువాత ఆ సన్న్యాసు లిరువురున్ను స్వాములవారికి "శిక్ష విధించి మమ్ములను సంఘములో

జేర్చుకొనవలసిన ”దని కబురు పంపిరి. అపుడు స్వాములవారు “సాధువులకు బట్టలు పెట్టవలెను. భోజనము పెట్టవలెను. నమస్కారములు చేయవలెను. జపము చేయవలె” నని ప్రాయశ్చిత్తకర్మలను విధించిరి. అట్లే వారు ఏలూరు ఆశ్రమములో చేసి సంఘములో చేరిరి.

గురువు పేరు చెప్పి తిరుగుచు గౌరవింపబడుచున్న వారిని, ధనమును సంపాదించువారిని స్వాములవారు బహిష్కరించెడివారు.

కాలుపై కాలువేసికొని కూర్చొనినవారిని, చేతులను తలను కదలించుచు కూర్చొనినవారిని చూచి స్వాములవారు కోపగించెడివారు.

మోకాలుపైకిగాని, పాదములవరకుగాని వస్త్రమును కట్టిన సాధుసన్న్యాసులను చూచి స్వాములవారు మందలించెడి వారు.

వైరాగ్యములేని సాధుసన్న్యాసులు, పరబ్రహ్మనిష్ఠ చేయని శిష్యులు, వ్యర్థముగా తిరుగుచు, వ్యర్థముగా మాట్లాడుచునుండు భక్తులు, పరోపకార దానధర్మములు చేయని గృహస్థులున్న వ్యర్థులని స్వాములవారు భావించెదరు.

ఇతరుల నేమియు యాచించరాదనియు, వైరాగ్యము లేనివారు ఆస్తిని వదలిపెట్టరాదనియు, ప్రాణము పోవునంతటి ఆపదగలిగినను ఇతరులను సహాయము కోరరాదనియు, మన చేయి ఎన్నడు క్రిందనుంచరాదనియు, పైనే నుండవలెననియు, ముందుపెట్టిన అడుగును వెనుకకు పెట్టకూడదనియు, ఒక్క

నిమిషకాలమునుకూడ వ్యర్థముగా గడుపక జపము, ధ్యానము, సంకీర్తన, సేవ, పరోపకారములతో గడుపవలె ననియు, ఎన్నడున్ను యుక్తాహారము, వివిక్తవాసము, ఈశ్వర చింతనమును విడువరాదనియును శ్రీ సద్గురుస్వాముల వారు చెప్పుచుండెడివారు. శ్రీ స్వాములవారు ఏబది గ్రంథములను వ్రాసిరి.

శ్రీ మలయాళ సద్గురుస్వాములవారి అవతార తపో ప్రబోధముచే విద్యాహీనులు విద్యావంతులైరి. కఠినాత్ములు కారుణ్య హృదయులైరి. సోమరులు శూరులైరి. అవివేకులు వివేకులైరి. వివేకులు భక్తులైరి. భక్తులు జ్ఞానులైరి. జ్ఞానులు లోకోద్ధారకులైరి.

1962-వ సంవత్సరం జులై నెల 12-వ తేదీ ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు శ్రీ మహర్షి మలయాళ సద్గురుస్వాముల వారు నిర్యాణము నొందిరి.

మంగళం శ్రీ సద్గురుభ్యోస్తు